# హిందూస్థాన్ పబ్లిషింగు కంపెనీ లిమిటెడ్.

ఈ కంపెనీతరఫున ప్రస్తుత ప్రాపంచక సమస్యలను గూర్చిన గ్రంథములను ప్రకటించుటకై ప్రయత్నించుటలో ఇదివరలో ప్రచురించి అణాశాఖరీదులో (1) స్పైనుదేశపు చరిత్ర (2) ప్రాపంచకపు రహస్యాలు, పావులాఖరీదులో 'అంతర్జాతీయ ప్రయోజనవిజ్ఞానము' అనునవి గాక యీ గ్రంథము కూడ యీశాఖకే చేర్చుటకు ప్రచురించడమైనది.

ఈ కంపెనీ స్థాపించినప్పటినుండి యింతవఱకు గడించిన అనుభవమునుబట్టి అణా ప్రచురణ ఏపదివేలవరకో ఖర్చుఅయిన గాని కిట్టుబాటుగా నుండదనియు, పావలా ప్రచురణ కూడ ఏనాలుగైదు వేలకో ఖర్చు అయినగాని గిట్టుబాటుగా నుండదనియు గ్రహింపగలిగితిమి.

పుస్తకములు గ్రామాలకు సహా అందజేయుటలో అధమము ప్రతితాలూకా ముఖ్యపట్టణమందు నొక ఏజన్సీని ఏర్పాటుచేయు నుద్దేశ్యముతో అందుకు యత్నించుచున్నాము కాని యింతవరకు చేసిన కృషినిబట్టి ఏర్పడిన ఏజన్సీలు తగిన శ్రద్ధతోను, వ్యాపారదృష్టితోను, జరుగుటలో చాలా వెనుక

బడియున్నవని స్పష్టపడినది. ఈవిషయమై యింకను మరికొ
కాలము యత్నించినపిమ్మట గాని మరోదారి తోక్కము

తక్కువ విలువగల పుస్తకములను వేయుటవల్ల పు
కముల గణ్యత పోవు నను సలహా కొంతమంది మా
యిచ్చియుండిరి. అదియును గాక హెచ్చుగా ఖర్చు
నంతకాలము హెచ్చుధరలతోనే పుస్తకములను వేయ నగత
ఉండదనే సలహా కూడ నిచ్చియుండిరి. కాని యీవిషయం
మా ఆశయము అణా, పావలా వరకు ధర
పెట్టి వివిధవిషయములపై క్లుప్తముగా గ్రంధము
ప్రకటించిన ప్రజాసామాన్యములోనికిన్ని, విద్యార్థులకు
రాజకీయప్రచారకులకును అందుబాటులో నుండు
ఆశతో యిటుల యత్నించుచున్నాము. ప్రస్తుతములో
తము ధర పెరుగుటను బట్టిన్ని పుస్తకముల విడుదల కగు
ములను బట్టిన్ని అణా, పావలా ప్రచురణశాఖకు యీ
రూపాయ ప్రచురణశాఖ చేర్చి యీ అనుభవమును గు
జూచినపిమ్మట మాకు సలహా యిచ్చిన పైన వివరించిన సల
లను గూర్చి యోచించ దలచితిమి.

రాజమండ్రి,
25-10-37.

పబ్లిషర్సు.

# ఉపోద్ఘాతము.

ఈ గ్రంథమును వ్రాయుటలో కొన్ని ఆంగ్లగ్రంథములు-కరపత్రములు నాకు కొంతవరకు తోడ్పడెను. హెచ్చు వివరములతో వ్రాయవలెనన్న యీ గ్రంథము చాలా పెరిగి పోవునను భయంతో ఏఅంశమునకు ఆఅంశము క్లుప్తముగా వ్రాయబడెను. ఇందు ఆయాదేశపటములు కనబరచలేదు. కారణం తెలుగున అట్లాసు లున్నవి. అవి జూచిన చాలవరకు యిందలి అంశములు బోధపడగలవు. ఈ గ్రంథములోని మొదటి రెండు భాగములు నేనే వ్రాసితిని. మూడవ భాగము నామిత్రులు శ్రీ ఆర్. వి. కె. రావు గారివల్ల వ్రాయబడెను.

కొవ్వూరు,
ప॥ గోదావరిజిల్లా,
25-10-1937.

శ॥ సుబ్బారావు.

# విషయసూచిక.

## మొదటి భాగము.

## రెండవ భాగము.

మూడవ భాగము.



## అనుబంధము 1.



## అనుబంధము 2.



గాంధి

# భారతదేశము

యొక్క సంపూర్ణ స్వాతంత్ర్యం
దౌర్జన్యరాహిత్యమైన శాంతిసత్యంమీదనే
ఆధారపడి వుంది.
భారతదేశము యొక్క శాంతిసత్యమే
ప్రపంచకము నంతటికి

## ఆదర్శమార్గము



జవహరలాల్ - నెహ్రూ

# మొదటిభాగము

## సామ్రాజ్యము—అందలి ప్రజలు.

# 1 బ్రిటిషు సామ్రాజ్యము

బ్రిటిషు సామ్రాజ్యముయొక్క వైశాల్యము 13,909,782 చతురపుమైళ్ళు. భూభాగములో ¼ వంతు దీని క్రింధవున్నది. ఇందలి జనాభా 493,370,000 గలదు. దీని ప్రధానసగరము లండను. భారతదేశము యీ సామ్రాజ్యము క్రిందనే వుండెను. భారతదేశ వైశాల్యము 1,808,679 చ॥ మైళ్ళు. 352,837,728 మంది జనాభా. భారతదేశము బ్రిటిషుసామ్రాజ్యమునుండి తప్పి పోతే బ్రిటిషుసామ్రాజ్యము నామకార్థమే అగును. బ్రిటను జనాభా 4½ కోట్లు. వైశాల్యము 88,745 చదరపు మైళ్లు. వీరి ఆధీనమందుండే ప్రాముఖ్యదేశముల వివరములు యీదిగువను తెలుపబడెను. బ్రిటనునకు ప్రపంచకమంతటను అన్నిఖండాలలో, వారి ఆధీనమందున్న ప్రదేశా లున్నాయి.

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు. | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ఏడెన్ | అరేబియాలో దక్షిణమునయున్నది. | 42,000 | | ఏడెన్ | సైనికులుందురు ఓడలకు బొగ్గు వేసే ప్రదేశము. | |
| 2 | అండమాన్ నికోబారుదీవులు | 1937 లో ఇండియా నుండి విడిపోయెను. బంగాళాఖాతంలో నున్నవి. భారత దేశ పరిపాలనలో నున్నవి | | 10000 | పోర్టు బ్లైర్ | కొబ్బరి- భారతీయ ఖైదీలను యిందు వుంచుదురు. | 1868 సం॥రం |
| 3 | ఆస్ట్రేలియా | పసిఫిక్ మహాసముద్రములో. | 3000000 | 6623302 | కాన్ బెర్రా | | |
| 4 | బహారేయిన్ దీవులు. | పర్షియన్ సముద్రభాగములో నున్నవి. | | | | చేపలకు | |

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీ పట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది |
|---|---|---|---|---|---|---|---|
| 5 | బాసుటోలాండు | దక్షిణాఫ్రికాలోనుండెను. | | | | | 1868 |
| 6 | బెచు ఆనాలాండు ప్రొటెక్టరేటు | డిటో | | | | | |
| 7 | బోర్నియో | పసిఫిక్ మహాసముద్రములో | 284630 | 280000 | | నూనెగనులు | |
| 8 | బర్మా | 1937 లో ఇండియా నుంచి విడిపోయెను | 223000 | 15000000 | రంగూన్ | పెట్రోలు, టేకు, వెండి, బియ్యం, కలప | 1885 |
| 9 | కనడా | ఉత్తర అమెరికాలోనిది | 3648500 | 8788500 | ఒట్టావా | | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 10 | సెలోన్ | ఇదివరలో భారత దేశపరిపాలనలోనుండెను. ఇండియాకు దిగువను హిందూమహాసముద్రంలో నుండెను | 25400 | 5250000 | కొలంబో | టీ, రబ్బరు, కొబ్బరి | |
| 11 | సైప్రెస్ | మధ్యధరా సముద్రములో నున్నది | | 350000 | | పండ్లు, పొగాకు, ప్రత్తి- నావికాదళాశ్రయము | |
| 12 | ఫాల్కులాండుదీవులు | అట్లాంటిక్ మహాసముద్రములో దక్షిణాఫ్రికాకుదిగువభాగమున నున్నవి | | 3000 | | | |
| 13 | ఫిజీదీవులు | పసిఫిక్ మహాసముద్రములో ఆస్ట్రేలియాకు దగ్గిరగా నున్నవి | | 200000 | సువా | పంచదార, అరటిపండ్లు,కొబ్బరి | 1874 |

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 14 | గాంబియా | ఆఫ్రికాలో పడమటి భాగమున కలదు | | 200000 | | | |
| 15 | జిబ్రాల్టర్ | మధ్యధరా సముద్రంలో స్పైను దేశముదగ్గిర నుండెను | 2 చ. మై. | 21,000 | | నావికాదళాశ్రమము | 1704 |
| 16 | గోల్డుకోస్టు | ఆఫ్రికాలో పడమటి భాగమునవున్నది | | 5000000 | అక్రా | కోకో | |
| 17 | గయానా | దక్షిణఅమెరికా ఉత్తరభాగమున నున్నది. | 89000 | 320000 | జార్జిటౌన్ | పంచదార బెల్లపు సారాయి బెల్లపు పిండి కలప [illegible] ముడి [illegible] వజ్రములు | 1796 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 18 | హాండురాస్ (బ్రిటిషు) | మధ్య అమెరికాలోనిది | 8500 | 54000 | | కలప, అరటి, కోకో | |
| 19 | హాంగుకాంగ్ | చైనాలోనిది - సముద్రతీరముననున్నది. | | 1000000 | | | 1841 |
| 20 | ఇండియా | ఏసియాఖండములోనిది | 1808679 | 352837776 | ఢిల్లీ | కల్పతరువు | 19 వ శతాబ్దం |
| 21 | జమైకాదీవులు | మధ్యఅమెరికాకు దగ్గరగానున్న విఅట్లాంటిక్ మహాసముద్రములోనివి | | 1000000 | | | 1655 |
| 22 | కెన్యా | ఆఫ్రికాలో తూర్పు భాగమున కలదు | 250000 | 3000000 | నైరోబి | బంగారము | 1885 |
| 23 | కొవెఇట్ | పరిష్యన్ సముద్రభాగమున ఇరాకుదిగువను కలదు | | | | | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 28 | మెరిటియస్ దీవులు | హిందూ మహాసముద్రములో మెడగాస్కర్ వద్ద నున్నవి | | | | పంచదార | |
| (౨) 29 | న్యూఫౌండులాండు | కెనడావద్దనున్నది | 42734 | 290000 | | కాడ్ లివర్ ఆయిల్ (చేపనూనె) చేపలు సముద్రి క్షీరజంతువుల చర్మములు | 1497 |
| 30 | న్యూగినియా | ఆస్ట్రేలియావద్ద నున్నది. | తూర్పు పడమర పొడవు 1500 | 1000000 | | | 1883 |
| 31 | న్యూహెబ్రిడెస్ దీవులు | పడమటి పసిఫిక్ మహాసముద్రంలోనిది. | 1500 | 50000 | | కొబ్బరి, కోకో, ప్రత్తి | 1906 |
| 32 | న్యూజెలాండు | ఆస్ట్రేలియావద్ద నున్నది | 104000 | 1500000 | వెల్లింగ్టన్ | ఉన్ని, మాంసం వెన్న, బంగారం, బొగ్గు. | 1840 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | సామోఆన్ దీవులంటారు. | | | | | క్రిందనున్నవి. యుద్ధానికి పూర్వము ఇవి జర్మనీవి |
| 38 | ఆల్ డాబ్రా దీవులు శెయిశ్చెల్లెస్ దీవులకు సంబంధించినవి | మెడగాస్కర్ దీవి వద్ద వున్నది. | | | నైరులెస్ట్రేషను గాలిలో పెట్టిన రగుల్కొనురసాయన పదార్థములుదొరకును. | |
| 39 | సియెర్రాలియోనె | ఆఫ్రికాలో పడమటి భాగమున నున్నది. | | 1500000 | తాటినూనె | 1788 |
| 40 | శొకోట్రా దీవి | ఆఫ్రికాలో ఇటాలియన్ సోమాలీలాండుకుదగ్గరగానున్నది. | 1400 | 12000 | | 1886 |

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది |
|---|---|---|---|---|---|---|---|
| 41 | బ్రిటిషుసోమాలిలాండు | ఆఫ్రికాలోనిది. | | 350000 | | చర్మములు | 1884 |
| 42 | దక్షిణాఫ్రికా (యూనియన్ ఆఫ్ సౌత్ ఆఫ్రికా) | ఆఫ్రికాలోనిది. | 472350 | 7000000 | కేప్ టౌన్ ప్రెటోరియా | బంగారం వజ్రాలు, రాగి చర్మాలు, కోకో కాఫీ, దబ్బుపదంతాలు | |
| 43 | దక్షిణ పడమర ఆఫ్రికా. | ఆఫ్రికాలోనిది. | | | | | యుద్ధం తర్వాత [illegible] కి దక్షిణాఫ్రికాకు కలిపిరి |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 44 | సుడాన్ (ఆంగ్లో ఈజిప్టియన్) | ఆఫ్రికాలోనిది. | | | | ప్రత్తి | ఈజిప్టు బ్రిటను పరిపాలనలోనున్నది. 1898-9 |
| 45 | సూయజు కాలువ ప్రదేశము. | మధ్యధరా సముద్రం ఎర్రసముద్రముమధ్యనున్నది. | | | పోర్టుసైదు | | 17 నవంబరు 1868 ఇది ఒక కంపెనీ క్రింద వుంది. 1927 100కి37 వరకు |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | | | | | బ్రిటిషు వారు ప్రవేశించిరి |
| 49 | ట్రాన్సజోర్డన్ | అరేబియాకు పైభాగమునకలదు | | 300000 | | |
| 50 | ట్రినిడాడ్ దీవి | దక్షిణ అమెరికాలో ఉత్తరభాగమున కలదు. | | 50000 | కోకో పంచదార నూనెగనులు సరకులను తయారు చేసే బంకమన్ను | 1797 లో స్పైను వారి వద్దబ్రిట నుతీసికొనెను. |
| 51 | ఉగాండా | ఆఫ్రికాలో తూర్పు భాగమున కలదు | | 3750000 | ప్రత్తి | 1894 |
| 52 | పడమటి ఇండియాదీవులు. | ఉత్తర దక్షిణ అమెరికాలమధ్య అట్లాన్ | | | | |

| సంఖ్య | ప్రదేశం పేరు. | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధాని పట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది |
|---|---|---|---|---|---|---|---|
| | వీటిలో | టిక్ మహాసముద్ర | | | | | |
| | బాహామాస్ | ములో కలవు. | | 60000 | | | |
| | లీవార్డ్స్ | | | 122000 | | | |
| | విండ్‌వార్డ్స్ | | | 82000 | | | |
| | బార్‌బాడూస్ | | | 180000 | బ్రిడ్జి టౌన్ | పంచదార,ప్రత్తి | 1( 25 |
| | బ్రిటిషువారివి. | | | | | | |

ఈపైప్రదేశాలలో ప్రాపంచకమందంతటిలోని హెచ్చుగా ఉత్పత్తిఅయ్యే సరకులలో రబ్బరునకు మలయా పెనిన్సులాయున్ను, గోల్డుకోస్టానుండి కోకోయున్ను, ఇండియానుండి ప్రత్తిన్ని, దక్షిణాఫ్రికానుండి వజ్రములున్ను ఉత్పత్తి అగును. ఇవి బ్రిటిషుసామ్రాజ్యముక్రిందనే యున్నవి.

## బ్రిటిషువారి పెట్టుబళ్లు.

---

బ్రిటిషువారు తమ ఆధీనంలో నున్న యీపైన వివరించిన ప్రదేశములలో వర్తకవ్యాపారమునకుగాను 1933 ఆఖరునకు యీ దిగువరీతిగ పెట్టుబళ్ళు పెట్టినటుల "ది ఎకానిమిక్ జర్నలు" అను పత్రిక 1935 శెప్టెంబరు నెలలో ప్రచురించిన దానిలో ప్రచురించెను.

| వివరాలు | పెట్టుబడి | పెట్టుబడివల్ల రాబడి |
|---|---|---|
| | పౌనులు | పౌనులు |
| గవర్నమెంటునకు | 1061262000 | 45137000 |
| మ్యునిసిపాలిటీలకు | 85828000 | 4001000 |
| రైల్వే | 251400000 | 7476000 |
| ఇతర విధాల | 91000000 | 4,650,000 |
| వెరశి | 3666000000 | 158300000 |

## బ్రిటిషువారి వర్తకవ్యాపారము

1924—33 సంగరములలో బ్రిటిషువారిక్రిందనున్న పైన వివరించిన దేశాలవారు 1,604,239,649 పౌనుల విలువ గల సరకులను బ్రిటనునుండి కొన్నారు. ఈ పై దేశాలవారి వద్దనుండి బ్రిటను కొన్న సరకుల విలువ 2937554679 పౌనులు.

## సామ్రాజ్య తత్త్వంవల్ల లాభం.

బ్రిటిషువారి సొమ్ముకు పోటీ లేకుండా వడ్డీగిట్టేటట్లున్న, బ్రిటనునకు కావలసిన సరకులను చౌకగా కొనుటకున్ను, ఆసరకులతో బ్రిటనువారు తయారుచేసే సరకుల విడుదలకున్ను, బ్రిటిషు జనాభాలోని కొందరు యితరచోట్ల అధికారంతో హాయిగ నివసించుటకున్ను యీ పైన వివరించిన దేశాలను బ్రిటనువారు ఆక్రమించిరి.

## ప్రాపంచమంతటిలో ఉత్పత్తి అయ్యే సరకులలో బ్రిటిషువారి ఆధీనమందున్న భాగములు.

కోకో, వేరుశనగ, ఉన్ని, జనపనార, రబ్బరు, నిక్కేలు, బంగారము మున్నగువాటి ప్రాపంచక మొత్తపు ఉత్పత్తిలో 50వంతులున్నూ, ఖనిజపదార్థములలో 30-వ వంతులున్ను అనగా మాంగనీస్, తుత్తినాగము, సీసము, టిన్ రేకు, మున్నగునవి. ఇతర సరకులలో గోధుమ, కూరగాయలు, నూనెలు, కొబ్బరి, ప్రత్తి, బొగ్గు, రాగి, వెండి మున్నగువాటిల్లో 20-వ వంతులున్నూ బ్రిటను ఆధిపత్యంలోనున్న పైన వివరించిన దేశాలలో ఉత్పత్తి అగును.

ఏ సామ్రాజ్యం క్రిందనున్న దేశాలస్థితి అయినా యింతే.

ఈ పై ప్రదేశాలలోని స్వదేశస్థులను బ్రిటిషువారు అణగత్రొక్కి వుంచుటకుగాను స్వదేశస్థులలో జమిందార్లు, భూస్వాములను ఏర్పాటుచేసిరి. ఈ జమిందార్లు, భూస్వాములు, తమ ధనికబలము ఎక్కడ పోతుందో అని, వీరిని నిర్మించిన బ్రిటిషువారిని ఆశ్రయించుతూ వుంటారు. ఇందువల్ల స్వదేశస్థులలో ఐకమత్యం వుండదు. ఇంతే గాక మరికొందరికి పెద్ద ఉద్యోగాలు, బిరుదులు, తదితర రీతులుగ లాభాలు కలుగజేసి స్వదేశస్థులలో ఐకమత్యం లేకుండా వుండేటట్లు చూస్తూ వుంటారు.

జమిందార్లు, భూస్వాములు, బ్యాంకర్లు అనే తరగతి విభాగంవల్ల కొద్దిమందే శ్రీమంతులుగను, హెచ్చుమంది బీదవారుగను నుండేటట్లు జరుగుతోంది. ఇందువల్ల ఆర్థికతగాదాలు కలుగుతున్నాయి. ఈ ఆర్థికసరఫరా సరిగా లేనందువల్లనే హెచ్చుమంది జనాభాకు కడుపునిండా తిండి, వంటినిండా బట్ట, నిలుచుటకు నీడ, మానవునకు కావలసిన విజ్ఞానము, కలుగడం లేదు.

ఈ కారణాలవల్ల సామ్రాజ్య తత్త్వము అమలులో నున్నంతకాలము సామ్రాజ్య దేశాలలో నుండే ప్రజలలో శాంతికి తావుండదని గతచరిత్రవల్లను స్పష్టపడుచున్నది.

# 2. ఫ్రెంచి సామ్రాజ్యము.

బ్రిటీషువారి సామ్రాజ్యము తర్వాత ఫ్రాన్సే వచ్చును. దీని సామ్రాజ్యవైశాల్యము 4,450,000 చతురపుమైళ్లున్నది. ఇందలి జనాభా రమారమి 6 కోట్లు. ఇందులో ఫ్రాన్సులోని జనాభా 4 కోట్లు ఇమిడియున్నది. వీరిపరిపాలనలోనే మిగతా 2 కోట్లు ప్రజలున్నారు. ఫ్రాన్సు వైశాల్యము 212660 చ॥మై. పేరిస్ ప్రధాననగరము.

వీరి క్రిందనున్న దేశాల వివరములు యీదిగువను తెలుపబడెను.

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు. | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది |
|---|---|---|---|---|---|---|---|
| 1 | అల్గేరియా | ఆఫ్రికాలో ఉత్తరమున నున్నది. | | 6000000 | | సారాయి, గోధుమ, బార్లీ, అలీవు నూనె | 1830-47 |
| 2 | కామెరూన్ | ఆఫ్రికాలో మధ్యభాగమున కలదు. | | | | | గత మహాసంగ్రామమునకు పూర్వము జర్మనీది. |
| 3 | డహూామై | ఆఫ్రికాలో పడమటిభాగమున కలదు. | | | | | డిటో |

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మె. | జనాభా | రాజధాని పట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది |
|---|---|---|---|---|---|---|---|
| 4 | ఈక్వాటోరియల్ ఆఫ్రికా | ఆఫ్రికాలో మధ్య భాగమున కలదు. | 900000 | 3000000 జనాభా తగ్గిపోతోంది. | | | 1849 |
| 5 | గుయానా | ఆఫ్రికాలో పడమటి భాగమున కలదు. | | 2000000 | | రబ్బరు, తాటినూనె, పోకచెక్కలు. | |
| 6 | గుయాని | దక్షిణ అమెరికాలో ఉత్తర భాగమున కలదు. | | 22000 | కాయెన్నె | బంగారము. | ఖైదీలనువుంచెదరు. |
| 7 | ఇండోచైనా | చైనాప్రక్కనున్నది. | 285000 | 22000000 | | బియ్యము బొగ్గు టీ పంచదార. | 1862 |
| 8 | ఐవరీకోస్టా | ఆఫ్రికాలో పడమటి | | 4000000 | | బంగారముబొగ్గు | 1882 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | | భాగమున కలదు. | | | | మంగనీస్ కూరగాయలు. | |
| 9 | క్యాంగ్ - చౌఉవాన్ | ఇండోచైనాకు పైన గలదు. | 200 | 25000 | | | 1898 లో చైనా వద్ద కౌలుకు తీసుకున్నారు. |
| 10 | మడగాస్కర్ దీవి | ఆఫ్రికాకు తూర్పున హిందూమహా సముద్రములో కలదు. | | 3750000 | అంటానానారివ | బియ్యం గ్రాఫైటు మైకా ఫాస్ఫేటు పశుసంపద వ్యవసాయం తోళ్లు పదును చేసే చక్క. | 1896 |
| 11 | మారిటానియా | ఆఫ్రికాలో సహారా ఎడారివద్ద నున్నది. | | 500000 | | | 1903 |

| వరుససంఖ్య | ప్రదేశంపేరు | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైన |
|---|---|---|---|---|---|---|---|
| 12 | మొరాకో | ఆఫ్రికాలో ఉత్తరమున పడమటిభాగమున కలదు. | | 4500000 | | ఖనిజమ్ము ఇందు ఫోస్ఫేటు బాగా ఎగుమతిఅగును. | 1912 |
| 13 | న్యూకాలి డోనియాదీవులు | ఆస్ట్రేలియావద్దకలవు | 8500 పొడవు 250 మైళ్లు | 57300 | | కొబ్బరి, పత్తి, కాఫీ, నిక్కెలు, ఇనుము, మాంగనీస్, రాగి, మణిశిల. | 1853 |
| 14 | న్యూహెబ్రిడెస్ దీవులు వీటిల్లో పెద్దది ఎస్పిరిటు సాంటో దీవి | డిటో | 1500 | 50000 | | కొబ్బరి, పత్తి. | 1906 బ్రిటన్ కూడా ఇందలి |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | పరిపాలనలో భాగము కలదు. |
| 15 | నిగర్ కోలోనీ | ఆఫ్రికాలో పడమటి భాగమున నున్నది. | 380000 | 3500000 | | ప్రత్తి. | 1890 |
| 16 | పాండుచేరి కారికాల్ చందర్నాగూరు మహే యానాం | ఇండియాలోనివి. | 280000 | | | | 16, 17 శతాబ్దములో |
| 17 | శెనెగాల్ | ఆఫ్రికాలో పడమటి భాగమున నున్నది. | | | | | 17-వ శతాబ్దం |
| 18 | సోమాలిలాండు | ఆఫ్రికాలో తూర్పు భాగమున కలదు. | | | | జిబుటుఅను ఓడ రేవునుండి అబీసీనియాలోని అడి | 1888 |

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీ పట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీన మైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 19 | సిరియా | అరేబియాకు ఉత్తరమున నున్నది. | | | | ను ఆబాబాకు రైలు కలదు. పొగాకు నారింజ నిమ్మపండ్లు ఖర్జూరము. | 1920 1936 స్వాతంత్ర్యము కలిగెను |
| 20 | సుడాన్ | ఆఫ్రికాలో పడమటి భాగమున నున్నది. | 380000 | 3500000 | | పత్తి. | 1890 |
| 21 | టూనిస్ | ఆఫ్రికాలో .ఉత్తరమున నున్నది. | | 2400000 | స్ఫాక్సు Sfax | పప్పు దినుసులు సారాయి. | 1883 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 32 | పడమటి ఇండీయా దీవులు వీటిల్లో గులాడాలో ఉపెమార్టినిక్యో | మధ్య అమెరికావద్ద నున్నవి. | | | | కాఫీ కోకో నిమ్మపళ్లు, పంచదార అరటిపండ్లు. |

ఈపైన వివరించిన పరిదేశాలలో హెచ్చుభాగము ఆఫ్రికాలోనే కలవు. తూర్పుతీరమున ఇండోచైనాయే వీరికున్నవాటిల్లోకెల్లా పెద్దభాగము. ఈప్రదేశాలలోనుండే స్వదేశస్తులకు తగిన ఆర్థికరాజకీయహక్కులు లేనందున శాంతిలేకుండానే ఉంది.

ఫ్రాన్సువారు తమసొమ్ములో 1914 నాటికే 5 కోట్ల ఫ్రాంకులను వీరి ఆధీనమందున్న దేశాలలో పెట్టుబడిగా పెట్టిరి. ఫ్రాంకు అనగా రమారమి ఒక అర్ధరూపాయి.

# అమెరికా సంయుక్త రాష్ట్రముల

# సామ్రాజ్యము.

---

ఈ సామ్రాజ్యవిస్తీర్ణము 711648 చ. మైళ్ళు. దీని జనాభా 1¼ కోట్లు. అసలు అమెరికా సంయుక్తరాష్ట్రాల విస్తీర్ణము 3750000. ఇందలి జనాభా 122775000. రాజధాని పట్టణము న్యూయార్కు.

వీరికిందనున్న ప్రదేశములను యీదిగువను వివరింపబడెను.

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు. | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది |
|---|---|---|---|---|---|---|---|
| 1 | అలాస్కా | ఉత్తర అమెరికాలో కెనడా ప్రక్కనున్నది | 586000 | 60000 | జునెఆవు | బొగ్గు, కలప, బంగారం, చేపలు | 1867లో రష్యానుండి 72లక్షల డాలర్లకు కొనబడెను. డాలరు అనగా రు. 3లు. |
| 2 | అలెఉటిఅన్ దీవులు | అలాస్కా ప్రక్కనున్నవి. | | | | | |

| వరుససంఖ్య | ప్రదేశంపేరు | ఎక్కడవుంది | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది |
|---|---|---|---|---|---|---|---|
| 3 | గుఆమ్ దీవులు. | ఆస్ట్రేలియాకు పైభాగమున కలవు. | | | | | |
| 4 | హావాయిఆన్ దీవులు. | పసిఫిక్ మహాసముద్రములో ఉత్తర అమెరికావద్ద నున్నవి. | 4015 | 300000 | హానోలు | పంచదార, అనాసపండ్లు | 1778 లో కెప్టెను కుక్ వల్ల కనుగొనబడెను. |
| 5 | పెనామా కాలువ జోన | మధ్య అమెరికాలో నున్న ఏ అటాంటిక్ పసిఫిక్ మహాసము | 5 మైళ్ళవెడల్పునఒక్కవైపునకు. అ | 29600 | | | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | | ద్రాలను కలుపుచున్నది. | మెరికా సంయుక్తరాష్ట్రముల ఆధీనంలో నున్నది | | | | |
| 6 | ఫిలిప్పైను దీవులు. 7000 దీవులు యిందు గలవు. | ఆస్ట్రేలియా, చైనా, మధ్యను నున్నవి. | 114000 | 13000000 | మూని లాం 1934 తాత్కాలికంగా 10 ఏండ్లు వరకు స్వాతంత్ర్యం యిచ్చిరి. | బియ్యం, నార, కొబ్బరి, పంచదార, పొగాకు, రబ్బరు. | 1521 లో మాగెలిన్ అను స్పైనువాని వల్ల కనుగొనెను. స్పైను నుండి అమెరికా |

| వరుససంఖ్య | ప్రదేశం పేరు | ఎక్కడవుండి. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధాని పట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 7 | సామోఆ దీవులు | ఫీజీదీవులవద్ద నున్నవి | | | ... | ... | 1898-9 లో తీసికొనెను. గత మహాసంగ్రామ అనంతరము జర్మనీ నుండి వీరికి చేరెను. |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | పాగోపాగో ఓడరేవు | | | 8800 | నావికా దళాశ్ర మము, కొబ్బరి, ఇతర పండ్లు. | |
| 8 | పడమటి ఇండియాదీవులు- | మధ్యఅమెరికా వద్దనున్నవి. | | | పంచదార, కాఫీ కోకో, పండ్లు, పొగాకు | |
| | పుఎర్టో | | | 1500000 | | 1898 లో స్పైను నుండి జయించారు. |
| | విర్గిన్ | | | 22000 | | 1917లో డెన్మార్కు నుండికొన్నారు. |
| | క్యూబా హైటి | నామకార్థపు స్వాతంత్ర్యాన్నియిచ్చిరి | | | | |

కూబాదీవుల స్వాతంత్ర్యగాథ.

ఈ పైప్రదేశాలలో కూబాదీవుల చరిత్ర చాలా కలదు. 1898లో అమెరికావారు ఆధ్వర్యము వీటిపై వహించారు. 1901 లో మాత్రం సైనికపరిపాలనను తొలగించి నామకార్థపు స్వాతంత్ర్యమును యిచ్చిరి. అమెరికా సంయుక్తరాష్ట్రములవారు యిందున్న భాగ్యములో నూటికి 80 వంతుల వరకు వీరిఆధీనంలోనే ఉంది. ఇందున్నభూభాగంలో ⅓ వంతుభాగం అమెరికన్ కార్పొరేషన్సు ఆధీనంలోఉంది. కూబాలోని స్వదేశస్థులకు తక్కువకూలిరేటే వుంది.

ఇది పంచదార పరిశ్రమకు ప్రసిద్ధి. దీనికి వేసే చెరకు తోటలను నరికే నెలాపదిహేను రోజులలో తప్ప స్వదేశస్థులకు కూలివుండదు. ఈకాలంలో సంపాదించిన సొమ్ముతో మిగతా సాలుఅంతా జీవించాలి. ఈపరిశ్రమ అంతా అమెరికావారి ఆధీనంలోనే ఉంది. స్వదేశస్తులలో మితిమీరిన దారిద్ర్యంవల్ల సామ్యవాదతత్త్వం పెరిగింది. దానిని అణచుటకు అమెరికా అధ్యక్షుడైన రూజువెల్టుకూడా 1936 లో నిరంకుశముగానే ప్రవర్తించెను.

1935 లో జరిగిన కార్మికసమ్మె ఫలితంగా అనగా గత 2 సంవత్సరములలో 400 మంది యీ ఆందోళనకై ప్రభుత్వ శాసనములకు గురియై చచ్చిపోయిరి. వీరిలో విద్యార్థులు,

ఆచార్యులవార్లు (ప్రొఫిసర్సు), కార్మికనాయకులు, పత్రికా సంపాదకులు,న్యాయవాదులు (లాయర్లు),డాక్టర్లు (వైద్యులు), గలరు.

ఈరీతిగ ప్రభుత్వశాసనములకు గురియైన కూబా దేశ స్తులు జైళ్ళలో తమ హక్కుల సంరక్షణ కొరకు నిరసనవ్రతములను బూనిరి, దానిఫలితముగ కొందరు చచ్చిపోయిరి. వారిని హింసించడములో చేసేపనులు మానవులు వింటే సహించలేనివిగ నున్నటుల "టెర్రరు ఇన్ కూబా" అను చిన్నపుస్తకమును ఆర్థర్ పిన్‌కస్ అను ఆయన వ్రాయగా న్యూయార్కులోనున్న వర్కర్సు డిఫెన్సులీగువారు ప్రచురించిరి. గానయిందు వివరింపబడెను. 4000 మంది రాజకీయఖైదీలను నరక కూపములుగా నుండే చిన్నగదులలో సర్ది బాధపెట్టినారట. ఒక్కొక్కగదిలో 140 మందిని యిరికించిరనాట. ఈ ఖైదీలకు ఉత్తరాలుగాని, పుస్తకాలుగాని, సరియైనతిండిగాని లేదట.

1935 లో పెట్టిన యీహింసలకు పూర్వము నేషనల్ కూబాన్ కన్ ఫెడరేషన్ ఆఫ్ లేబరు అను సంఘములో వేనకు వేలు కార్మికులు స్వసంరక్షణార్థం సభ్యులుగా చేరిరి. ఇట్టి సంఘాలను 1935 లో జరిగిన కార్మికసమ్మెకట్టునల్ల అక్రమసంఘాలుగ నేర్పాటుచేసి అందలి కాగితాలను కూబాప్రభుత్వము స్వాధీనపరచుకొనెను. వీటిసొమ్ములను ప్రభుత్వమే వశపరచుకొనెను.

క్యూబాలోనున్న పాఠశాలలు, హైస్కూళ్లు, కళాశాలలు చాలవరకు ప్రస్తుతంలో మూసేవున్నవి. 1927 నుండి యిందలి సర్వకళాశాల మూసేవుంది. క్యూబాలో 50000 మంది సైనికులున్నారు. విద్యకు ఖర్చుచేయడం మానేసి సైనికవర్గానికే అమితఖర్చును ఆప్రభుత్వం చేస్తోంది. ఈరీతిగ క్యూబాప్రజలు నేటికిని తమ ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యంకోసం బాధపడుతున్నారు.

సామ్రాజ్యతత్త్వంవల్ల కలిగే ఫలితాలివేఅని తేలుతోంది.

అమెరికా సంయుక్తరాష్ట్రములు 1925 నాటికి తమ ఆధీనమందున్న దేశాలలో 9½ కోట్ల డాలర్లను పెట్టుబడిగా పెట్టెను. డాలరు అనగా రమారమి మూడు రూపాయలు.

## అమెరికా సంయుక్తరాష్ట్రములలోనున్న నీగ్రో సమస్య

అమెరికాలోని స్వదేశస్థులలో నీగ్రోజాతివారున్నారు. ఆజాతివారికి ఆర్థిక, రాజకీయహక్కులు అమెరికాను వశపరచుకున్న తెల్లజాతివారితోపాటు లేవు. ఈ నీగ్రోజాతివారిని ఇప్పటికి తెల్లవారు కొరడాలతో కరకుకట్టి కొట్టడం ఉంది. వేరే న్యాయవిచారణచేసి తీర్పుచెప్పడంలేదు. దీనికి ఆంగ్లమున లిన్చింగు అంటారు. ఇట్టి పద్ధతులు యిప్పటికిని ఇంకా అమలులో నుండడాన్నిబట్టి సామ్రాజ్యతత్త్వంలోనుండే లోపములను గ్రహింతురుగాక!

| సం॥రములు. | లిన్ చింగ్ కు గురి అయిన నీగ్రోలు | ఫలితము |
|---|---|---|
| 1925 | 18 | వీరిలో యిద్దరికి పిచ్చ ఎక్కెను. ఒకరిని ఉరికంభము శిక్షనుండి న్యాయవాది తప్పించే తీర్పు యిచ్చెను. |
| 1926 | 34 | ఇందులో 5 గురు తెల్లవారు, 2 నీగ్రో ఆడవాళ్ళున్నారు. |
| 1927 | 21 | వీరిలో 2 తెల్లవారు గలరు. |
| 1928 | 18 | వీరిలో ఒకడే తెల్లవాడు గలడు. |
| 1929 | 12 | 4 గురు తెల్లవారున్నారు. ఒక తెల్లజాతిస్త్రీ కలదు. |
| 1930 | 35 | ఒకడు తెల్లవాడు ఒక తె ఆడది గలరు. |
| 1931 | 14 | ఒక తెల్లవాడు గలడు. |
| 1932 | 10 | ఇద్దరు తెల్లవారు గలరు. |
| 1933 | 28 | ముగ్గురు తెల్లవారున్నారు. |
| 1934 | 16 | |
| 1935 | 24 | |

ఈ శిక్షలు సాధారణంగా నీగ్రోలకు యిచ్చే కూలీ హెచ్చు అడుగుటలోను కూలికి వెళ్ళకుండా సమ్మెకట్టుట వల్లను దొంగతనము వల్లను వచ్చునట.

ఈవివరములు "ట్రూఫ్రీడమ్ ఫర్ నీగ్రో అండు వైటు లేబరు" అనే బుక్కును ఫ్రాంక్లిన్ అల్, క్రిస్ వైత్ అండు ఆల్‌ఫ్రెడ్ బాకెర్ లెవిస్ అను వారిరువురు వ్రాసిన గ్రంధమందున్నవి. ఈ పుస్తకమును న్యూయార్కులో నున్న నీగ్రో లేబరు న్యూస్ సర్వీసువారు ప్రచురించిరి.

ఈ గ్రంథంలోనే మార్కస్‌గార్వే అను ఆయన నీగ్రోసమస్యను పరిష్కరించవలెనంటే ఆఫ్రికాలో నల్లజాతి సామ్రాజ్యమును స్థాపించవలెనని చెప్పెనట. అమెరికాలో తెల్లయిల్లును తెల్లవారు ఏలానిర్మించిరో ఆలాగే ఆఫ్రికాలో నల్లయిల్లును నిర్మించవలెనని చెప్పినటుల వ్రాసిరి. ఈరీతి పలుకుటవల్ల యీసమస్యలు పోవుసవికావని బుద్ధిమంతులు రాజకీయజ్ఞానము కలవారు తెలుసుకోవలెను. ఆర్థిక తగాయిదాలకు తావులేకుండా పోవలెనే గాని యివివున్న తెల్ల సామ్రాజ్యమైనా ఒక్కటే నల్లసామ్రాజ్యమైనా ఒక్కటే. అమెరికా అధ్యక్షుని ఎన్నికలలో రిపబ్లికన్ పార్టీవారు నీగ్రో వోటర్లకు లిన్‌చింగు తీసివేసేబిల్లు పెట్టుతామనిచెప్పి యింత వరకు ఆపార్టీవారు ఆబిల్లును పెట్టలేదట.

## నీగ్రో తెల్లజాతి కార్మికులు.

అమెరికాలో నీగ్రో జాతి కార్మికులకు తెల్లజాతి కార్మికులు సామ్యవాద తత్త్వమును ప్రచారం చేస్తున్నారు. వారికి వేరే పార్టీ ఉంది. యీపార్టీ ప్రచారానికి పత్రికలున్నాయి. యీ పత్రికలలో "సోషలిస్టుకాల్" అనునది వారిపార్టీ పత్రిక. కార్మికసమ్మెలను అమెరికా ప్రభుత్వం ఏలా అణచుచున్నదో కార్మికులు ఏలాంటి బాధలు పొందుతున్నారో వీరు తమ పార్టీపత్రికలో వ్రాయడం కలదు. నీగ్రోలలో నూటికి 98 మంది కార్మిక కర్షకులకు చేరినవారే. వీరిలోని విద్యాధికులు వీరిమీదను ఆధారపడిన వారే గాన వీరు అంతా సామ్యవాద సంఘంలో చేరుతున్నారు. తెల్లవారిలోని కార్మిక కర్షకులు కలసి సామ్యవాద సంఘంలో చేరుతున్నారు. ఈ వుభయులు కలసిన సామ్యవాద సంఘాలలో తెల్ల, నలుపు జాతిభేగం లేకుండా ప్రచారం చేసుకొంటున్నారు.

అమెరికా ప్రభుత్వంకూడ సామ్యవాదమును ప్రచారం కాకుండా తన ఫాసిస్టుతత్త్వాన్నే అమలులో కార్మిక కర్షకుల ఎడల నుంచుతున్నదని యిచ్చటిసామ్యవాదులు బహిరంగంగా చెప్పుచున్నారు.

# 4· ఇటలీ సామ్రాజ్యము.

ఇటలీకి సామ్రాజ్యము ఆఫ్రికాలోనే గలదు. యితర చోట్ల బహుతక్కువ. తూర్పుతీర దేశాలలో అసలే సంబంధం లేదు. 1935 లో అబిసీనియాను ఆక్రమించెను. అబిసీనియా లోని స్వదేశస్తులకు ఇటలీవారికి అచ్చట సంఘర్షణాలు జరుగుచునే యున్నవి. దీని సామ్రాజ్య విస్తీర్ణము 935440 చ. మైళ్ళు జనాభా 90 లక్షలు. ఇటలీయొక్క విస్తీర్ణము 119000 చ. మైళ్ళు. జనాభా 41,150,000. రాజధానిపట్టణము రోమునగరము.

| సంఖ్య | ప్రదేశం పేరు | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది |
|---|---|---|---|---|---|---|---|
| 1 | అబ్సీనియా | ఆఫ్రికాలో తూర్పు భాగమున నున్నది. అబిసీనియా గవర్నమెంటుఅనుసడిస్వ దేశస్థులచే గోరెను అను చోటనున్నవి. | | 7000000 | ఆడిస్ ఆబాబా | చర్మములు ఖనిజఉత్పత్తికి చాలాసావుకాశము లున్నవి. మొక్కజొన్న గోధుమ బార్లీ ప్రత్తి కాఫీ పంచదార | 1936 |
| 2 | డోడెకానెసెదీవులు | గ్రీసువద్దనున్న ఏగయన్ సముద్రములో నున్నవి. | | 132000 | నావికా దళాశ్రమము | | 1912 |
| 3 | ఎరిట్రియా | ఆఫ్రికాలో ఎర్రసముద్రపుఒడ్డున నున్నది. | 45000 | 600000 | | | 1885 |

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు. | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 4 | లిబ్యా | ఆఫ్రికాలో ఉత్తరమునన్నది. | | 1000000 | | | 1911-12 లో టర్కీనుండి జయించెను. |
| 5 | సాసెనో దీవులు | గ్రీసువద్ద సముద్రములోనున్నవి. | | | | | |
| 6 | సోమాలిలాండు | ఆఫ్రికాలో తూర్పు భాగమున నున్నది. | 200000 | 1000000 | | పశుసంపద వ్యవసాయం | 1905 లో బనాడిర్ కంపెనీ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | | | | | నుండికో న్నారు. 1892 నుండి యీాకం పెనీ ఆధీ నంలోనే ఉంది. ఈమధ్య నే ప్రా న్సువల్ల ఇటలీకి యియ్య బడెను. |
| 7 | పెరిమ్ దీవులు. | ఎర్రసముద్రం ఏడెన్ సముద్రభాగము కల సినచోటనున్నవి. | | | | |

# 5. పోర్చుగీసు సామ్రాజ్యము.

భారత దేశ చరిత్రలో వీరికి బుడతకీచులని పేరు. సామ్రాజ్యవిస్తీర్ణము 981005 చ. మైళ్ళు. ఇందలి జ ఒకకోటి 90లక్షలు. అసలు దేశము అయిన పోర్చుగల్ ర్ణము 35490 చ. మైళ్ళు. జనాభా 15000,000. రాజ పట్టణము లిస్‌బన్. వారిఆధీనమందున్న దేశాల వివరాలు.

| వరుససంఖ్య | ప్రదేశం పేరు | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | అంగోలా | ఆఫ్రికాలో మధ్యను కలదు. | | 3000000 | | | 15-వ శతాబ్దంలో కనుగొనిరి. |
| 2 | పోర్చుగీస్ తూర్పు ఆఫ్రికా | ఆఫ్రికాలోతూర్పు భాగమునకలదు. | 300000 | 4000000 | | ప్రాపంచమందంతటిలో పెద్దది అయిన జెంబాసి బ్రిడ్జిని 1935 లో కట్టిరి. పంచదార రబ్బరు, కొబ్బరి, ఖనిజములు | 1498 లో వాస్కోడిగామా వల్ల కనుగొనబడెను. |

| వరుస సంఖ్య | ప్రదేశం రు | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధానీపట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీనమైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 3 | గోఆడామా ఒడిఉదీవులు | ఇండియాలో పడమటితీరమున గలవు. | 1600 | 580000 | | | 16-వశతాబ్దంలో కనుగొనిరి. |
| 4 | గినెయా | ఆఫ్రికాకు పడమటితీరమున కలదు. | | 365000 | | నూనెవిత్తనాలు బియ్యం | 1885 |
| 5 | మాకా ఒ | చైనాలో హన్‌కాంగువద్ద కలదు. | | 160000 | | | 1557 |
| 6 | టిమోర్ దీవులు | జావాదీవుల వద్దనున్నవి. | | | | | |

# 6. డచ్చి సామ్రాజ్యము.

హాలండు దేశము క్రిందనున్న సామ్రాజ్యమని పేరు. దీని సామ్రాజ్య విస్తీర్ణము 800938 చ. మైళ్లు, జనాభా 60000000. హాలండుయొక్క జనాభా 8290389. విస్తీర్ణము 12579 చ. మై.

వీరి ఆధీనమందున్న దేశాలు యీ దిగువ వివరింపబడెను.

| వరుస సంఖ్య | పరిదేశం పేరు | ఎక్కడ ఉంది. | వైశాల్యము చ. మై. | జనాభా. | రాజధానీపట్టణము | ఎందుకు ప్రసిద్ధి. | ఎప్పుడు స్వాధీనమైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | తూర్పుఇండియాదీవులు వీటిలో పెద్దవి. | హిందూమహా సముద్రములోనున్నవి. | 3250000 | | | | |
| | 1 సుమిత్రా | | | | | | |
| | 2 జావా | | | | ఒ టే | పంచదార, కాఫీ | |
| | 3 సెలెబస్ | | | 4000000 | వియా | పొగాకు, టీ, | |
| | 4 మొలుక్కాస్ | | | | | బొగ్గు. | |
| | 5 బాలి | | | 2000000 | | | |
| | 6 టుమోర్ ఆర్చిపెలాగో | | | | | | |
| | 7 బోర్నియో | | | | | | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2 | గుయానా | దక్షిణఅమెరికాలో ఉత్తరమున నున్నది. | | 160000 | సారాయి, పంచదార, వజ్రములు కాఫీ, బంగారం, బియ్యం. |
| 3 | న్యూగినియా | ఆస్ట్రేలియా వద్ద నున్నది. | | | |
| 4 | పడమటిఇండియాదీవులు. వీటిల్లో పెద్దది కురాకాఒ | మధ్యఅమెరికా వద్ద నున్నవి. | | | |

పై వాటన్నిటిలో జావాయొక్క స్వదేశస్తులలోనుండి జాతీయోద్యమము పెరిగినది. దాని ఫలితముగ కొంతవరకు వారిని సంతుష్టిపరచడం జరిగింది.

# 7. స్పైనుసామ్రాజ్యము.

---

స్పైను దేశీయులు చాలధైర్యవంతులు. వీరే మొదట దేశాలఆక్రమణకు బయలుదేరిరి. క్రమేణ వీరిప్రాబల్యం తగ్గింది. అమెరికావారు వీరి ప్రదేశాలలో కొన్నిటిని తీసికొనిరి.

వీరి సామ్రాజ్య విస్తీర్ణము 129000 చ. మైళ్ళు. ఇందలి జనాభా 10 లక్షలు. అసలు స్పైనుదేశముయొక్క విస్తీర్ణము 194000 చ. మైళ్ళు. జనాభా 22,800,000. రాజధాని పట్టణము మాడ్రిడ్. 14 ఏప్రియలు 1931 లో రాజుపోయి ప్రజాప్రభుత్వం ఏర్పడెను. 1936లో సామ్యవాద (సోషలిస్టు) ప్రభుత్వ మేర్పడెను. అప్పటినుండి స్పైనులోని ధనికులకు కార్మికకర్షకుల బాగుకొరకేర్పడిన సామ్యవాద ప్రభుత్వమునకు సంఘర్షణ ఏర్పడెను. ఈసంఘర్షణవల్ల స్పైనుయొక్క ప్రభుత్వం ముస్ముందు ఏలామారునో చెప్పజాలము వీరికున్న సామ్రాజ్యంకాస్తా ఆఫ్రికాలోనే కలదు. వాటివివరములు యీ దిగువను వివరింపబడెను.

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు. | ఎక్కడవుంది. | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధాని పట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎప్పుడు స్వాధీన మైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | స్పానిష్ సహారా | ఆఫ్రికాకు పడమటి వైపున నున్నది. | | | | | |
| 2 | మొరాకో | డిటో | | | | | |
| 3 | రియొడెఒరో | డిటో | | | | | 1885 |
| 4 | రియొముని | ఆఫ్రికాలో మధ్యను నున్నది. | | | | కోకో | |

# 8. బెల్జియము సామ్రాజ్యము.

దీనికున్న సామ్రాజ్యవిస్తీర్ణము 918,000 చ. మై. జనాభా 95 లక్షలు. అసలు దేశమైన బెల్జియం విస్తీర్ణము 11775 చ. మై. జనాభా 8,213,453. రాజధాని పట్టణము బ్రిస్సెల్సు.

బెల్జియమునకు ఆఫ్రికాలో బెల్జియన్ కాంగో అనునది 1885లో స్టాన్లీ అనువానిచే కనుగొనబడెను. బెల్జియం రాజు రెండవ లియపోల్డు అనువాని ఆధీనమందుండెను. ఇది కాంగో నది వద్దనున్నది. ఇది మంచి ఫలవంతమైన ప్రదేశము. ఇందలి జనాభా 95 లక్షలు. వైశాల్యము 91 లక్షల చ. మై. ఇందు బంగారము, రాగి, టిన్ రేకు, కొబ్బరి, కాఫి, రబ్బరు, మున్నగునవి ఉత్పత్తియగును.

# 9. డెన్మార్కు సామ్రాజ్యము.

దీనికే డేనిష్ అనిపేరు. డెన్మార్కు వైశాల్యము 16570 చ. మై. జనాభా 3,500,000. రాజధాని పట్టణము

కోపెన్‌హాగెన్. డెన్మార్కున కున్న సామ్రాజ్యము గ్రీన్‌లాండు ఉత్తర అమెరికావద్ద నున్నది.

10వ శతాబ్దములో నార్వేగియన్ ఎరిక్ దిరెడ్డు అను వానివల్ల కనుగొనబడెను. వైశాల్యము 736,000 చ. మై. ఇందులో 31,000 మైళ్లు మంచుతో నుండకుండా నుండును.

ఇందున్న జనాభా 16,600. ఈ ప్రదేశము చేపల కొవ్వుకు, చేపలకు ప్రసిద్ధి.

# 10, జపాను సామ్రాజ్యము.

ఇది తూర్పుతీర దేశములలోనిది. జపాను అన్నివిధాల బ్రిటనును అనుకరించుచు ప్రపంచమందన్ని దేశాలలోను తనవ్యాపారమును వృద్ధిజేసుకొనెను. జపాను దేశముయొక్క విస్తీర్ణము 260,000 చ. మై. జనాభా 9 కోట్లు. రాజధాని పట్టణము టోకియో. దీనికున్న సామ్రాజ్యవిస్తీర్ణము 265,129 చ.మై. ఇందలి జనాభా 23,000,000. జపానుయొక్క సామ్రాజ్యకాంక్ష 1914-18 యుద్ధానంతరమునుండి పెరిగెను. 1931 నుండియు చైనాను కబళించుటకు యత్నాలు చేస్తున్నది. దీనికున్న సామ్రాజ్య వివరములు యీ దిగువను వివరింప బడెను.

| క్రమసంఖ్య | ప్రదేశం పేరు | ఎక్కడవుంది | వైశాల్యము చ. మై. | జనాభా | రాజధాని పట్టణము. | ఎందుకు ప్రసిద్ధి | ఎపుడు స్వాధీనమైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | వైరెన్ | చైనాలో పోర్టు ఆర్థరు వద్ద నున్నది. | | 1500000 | | | 1915 లో చైనానుండి 99 ఏండ్లకు కౌలుకు తీసుకొనెను. |
| 2 | ఫార్మోసా | చైనా ప్రక్కను నున్నది. | 13900 | 5250000 | | టీ, పంచదార, బియ్యం, బొగ్గు, రాగి, బంగారం. | 1894-5 లో చైనానుండి జయించెను. |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 3 | కొరియా | డిటో | 85000 | 21000000 | | బియ్యం, పప్పు దినుసులు, పొగాకు, ప్రత్తి, బంగారం, గ్రాఫైటు | 1894-5 డిటో |
| 4 | మంచూకో (మంచూరియా) (నామకార్థంగా స్వాతంత్ర్యంతో ఉన్నది.) | ఉత్తర చైనాలోనిది. మంగోలియా లోని భాగ మయి యున్నది. | 500000 | 3 కోట్ల 40 లక్షలు. | | సోయాబీన్సు, పప్పు దినుసులు, బియ్యం, బొగ్గు, ఇనుము. | 1931-2 |
| 5 | పసిఫిక్ దీవులు ఇందులో మార్షల్ కారోలినె దీవులు గతసంగ్రామ అనంతరం జర్మనీ నుండి జపానుకు చేరెను. | | | | | | |

| వరుస సంఖ్య | ప్రదేశం పేరు | ఎక్కడ ఉంది. | వైశాల్యము చ. మై. | జనాభా. | రాజధాని పట్టణము | ఎందుకు ప్రసిద్ధి. | ఎప్పుడు స్వాధీనమైనది. |
|---|---|---|---|---|---|---|---|
| 6 | శఖాలిన్ | రష్యా జపాను దేశాలు కలసినచోటున నున్నది. | | 330000 | | బాగు. | 1905 లో రష్యా నుండి జయించెను. |
| 7 | కురైలిదీవులు | | | | | | 1875 |

షరా:— జపానుకు పసిఫిక్ మహాసముద్రంలో 4000 దీవులవరకు వున్నవి.

## 11. సోవియట్టురష్యా.

దీనికి సామ్రాజ్యతత్త్వము లేదు. సఖేలిన్ దీవిలో ఉత్తరభాగము సోవియట్టురష్యా క్రిందనే యున్నది.

సోవియట్టురష్యా విస్తీర్ణము 9251796 చ. మైళ్ళు. జనాభా 16 కోట్లు. రాజధానిపట్టణము మాస్కో. దీని కిపుడు లెనిన్‌గ్రాడు అనిపేరు పెట్టిరి.

## 12. సూర్యుడు ఎప్పటికి ఈ దిగువ మూడు రాజ్యాలలో అస్తమించడట.

సూర్యుడు ఎప్పటికిన్ని బ్రిటిషు, ఫ్రెంచి, డచ్చి, సామ్రాజ్యములలో అస్తమించడని బ్రిటను చరిత్రకారులు గ్రంథాలలో వ్రాయడం, అదే వారి ఆధీనమందుండే దేశాలలో బోధించడం జరుగుతోంది.

ఈ మూడు సామ్రాజ్యములు పడమటితీరమున నున్నవి. వీరికి తూర్పుతీరమున దేశాలున్నాయి. ఆవివరాలు వెనుకటి పేజీలలో వివరింపబడెను. అందువల్ల సూర్యుడు ఎన్నటికి అస్త

మించకుండా ఎప్పుడు యీభాగములలో ఏదోభాగమున ప్రకా శించుచుండుననియే దీని భావము.

ఈ సామ్రాజ్యములలో (1) గ్రేటుబ్రిటను తనకన్న 140 రెట్లు తనసామ్రాజ్యమును ప్రపంచకమం దన్నిమూలల వ్యాపింపజేసుకొనెను. (2) ఫ్రాన్సు తనవిస్తీర్ణం కన్న 22 రెట్లు అధికంగాను (3) హాలండు తనప్రదేశంకన్న 60 రెట్లున్ను, (4) బెల్జియం 80 రెట్లున్ను వ్యాపింప జేసుకొనెను.

---

# 13. ఆఫ్రికాలోని చార్టర్డు కంపెనీలు.

---

యూరోపియనులు చార్టర్డుకంపెనీల పేరిటను మొదట ఆఫ్రికాలో ప్రవేశించి అచ్చటి స్వదేశస్థులను (నల్లవారిని) బానిసలుగా చేసివైచిరి. క్రమేణ యీ కంపెనీలు ఆక్రమించిన ప్రదేశాలను ఆయాప్రభుత్వములే తమస్వాధీనము చేసుకొనెను

ఈ కంపెనీల వివరములు యీ దిగున వివరింపబడెను.

1. కాంగోలో ప్రవేశించిన కంపెనీ 1882లో ఎస్సోసియే షను ఇన్టర్నేషనల్డు కాన్గో అను పేరిటను,

2. 1885 లో కెనియా, ఉగండా ప్రాంతములలోనికి బ్రిటను వారు బ్రిటిషు ఈస్టు ఆఫ్రికాకంపెనీ అను పేరుతో నున్ను,

3. 1885 లోనే జర్మనీవారు ఈస్టు ఆఫ్రికాకంపెనీ అను పేరుతో నున్న

ప్రవేశించిరి.

4. 1886లో నిగేరియా ప్రాంతములోనికి బ్రిటిషువారు రాయల్ నిగేర్ కంపెనీ అను పేరుతో ప్రవేశించిరి.

5. దక్షిణాఫ్రికాలోనికి 1889లో దక్షిణాఫ్రికా చార్టర్డు కంపెనీ అను పేరిట ప్రవేశించిరి.

6. 1892లో ఇటలీవారు ఇటాలియన్ బెనాడిర్ కంపెనీ అను పేరుతో సోమలీలాండునందు ప్రవేశించిరి.

యీ రీతిగ ఆఫ్రికాలో ప్రవేశించిన కంపెనీలలో కొందరు వాటాదార్లు సంపాదించిన లాభముల అంకెలు బ్రిటిషు ఎంపైరు అను పేరిట లండనునుండి లీగ్ ఎగనెస్టు ఇంపీరి యలిజము అండు ఫర్ నేషనల్ ఇండిపెన్డెన్సు అనువారు ప్రచురించిన కరపత్రిమందు వివరింపబడెను.

| పేర్లు. | లాభములు. |
|---|---|
| | పౌనులు |
| 1. డ్యూక్ ఆఫ్ అబెర్కొర్న | 14324 |
| 2. డ్యూక్ ఆఫ్ ఫిఫె | 14708 |
| 3. ఎరెల్ గ్రే | 27612 |
| 4. లార్డు గిఫోర్డు | 38388 |

| | |
|---|---|
| 5. సర్ హెూరా సెఫరా కుహార్ | 60928 |
| 6. మిస్టర్ ర్హొడేస్ | 546376 |
| 7. మిస్టర్ బె ఇట్ | 459520 |
| 8. మిస్టర్ రొచ్ ఫోర్టు మ్యాక్వైర్ | 228860 |
| 9. గోల్డుఫీల్డ్సు ఆఫ్ సౌత్ ఆఫ్రికా | 477108 |
| 10. లార్డు రొత్ శ్చిల్డు | 167596 |
| 11. బీఎట్ అండు ర్హొడెస్ | 837964 |
| 12. ర్హొడెస్, రడ్ అండు బీఎట్ | 68,000 |

ఈవివరాలు అన్నియు "ఎకానిమిక్ ఇంపీరియలిజమ్" అను గ్రంధమును యల్. వూల్ఫు వ్రాసిన గ్రంధములో బాగా తెలియగలవు అని ఆ కరపత్రంలో వ్రాయబడెను.

ఇందువలననే సామ్రాజ్యమంటే యొక కంపెనీయే అని కొందరు రాజకీయవేత్తలు పోల్చుతున్నారు.

ఆఫ్రికాలో స్వాతంత్ర్యంగా మిగిలినది లిబేరియా అను ప్రదేశమే. దానిని కూడ ఎవరో ఒకరు కబళించాలనే చూస్తున్నారు.

మధ్యధరాసముద్రంలో కలిగే పరస్పరపోరాటములు.

---

ఆఫ్రికాలో ఇంగ్లీషు, ఫ్రెంచి, బెల్జియం, స్పెయిన్, ఇటలీ మున్నగు దేశములవారు వివిధ ప్రదేశాలను ఆక్రమించుటవల్లనున్ను, మధ్యధరాసముద్రమునకు, ఎర్రసముద్రమునకు

కలిపే సూయజుకాలువ త్రవ్వినందువల్ల ఇండియాకు మంచిరహదారి ఏర్పడుట వల్లనున్నూ, ముఖ్యంగా ఎర్రసము ద్రములోని హెచ్చుఅధికారము కొరకు ఇంగ్లండు, ఫ్రాన్సు, ఇటలీ దేశములు ఎవరిమట్టుకు వారే ప్రాకులాడుతున్నారు. ఫ్రాన్సునకు, హాలెండునకు తూర్పుతీరమున కొన్ని ప్రదేశాలున్నందున వారికి కూడా యీ సూయజుకాలువ అవుసరం కలిగింది. ఈ సూయజుకాలువను 17 నవంబరు 1869 లో 99 ఏండ్లకు ఇంటర్ నేషనల్ కార్పొరేషను అను పేరిట బ్రిటిషు వారు కౌలుకు పూర్వపు అటోమెన్ రాజ్యమువద్ద తీసుకొన్నారు. మంచి లాభముతో ఈకంపెనీ పని చేస్తోంది.

ఎర్రసముద్రము.

ఎర్రసముద్రంలోని అధికారంకొరకు పైన వివరించిన దేశాలవారే ప్రాకులాడుతున్నారు కాని ఇందు హెచ్చు అధికారం ఇటలీ వహించాలనే కోరికతో వుంది.

## 14. ఫసిఫిక్ మహాసముద్రం.

ఫసిఫిక్ మహాసముద్రంలోని దీవులలో హెచ్చు జపానుకు గలవు. అమెరికాకు కొన్ని గలవు. మిగతావారిలో బ్రిటనునకు, ఫ్రాన్సునకు, హాలండునకు, పోర్చుగీసువారికి కొద్దిగాకలవు. జపాను తనఅధికారమే హెచ్చుగా యీఫసిఫిక్ మహాసముద్రం లోనుండవలెనను కోరికతో వున్నది. ఇది అమెరికాకు గిట్టదు.

సింగపూరువద్ద బ్రిటిషువారు గొప్ప నావికాదళాశ్రమ మును 90లక్షల పౌనులు వెచ్చించి (పౌను అనగా రమారమి పదునాలుగు రూపాయలు.) 1939నాటికి పూర్తిఅగుటకు కట్టు తున్నారు.

జపాను తనప్రాబల్యమును పసిఫిక్ మహాసముద్రంలో హెచ్చుకాకుండా నుండుటకున్నూ హిందూమహాసముద్రంలో నికి చొరుచుకు రాకుండా నుండుటకే దీనిని నిర్మించుతున్నారు.

## 15. దిగువ సామ్రాజ్యములకు కావలసిన ముడిసరకులు.

1. అమెరికా సంయుక్తరాష్ట్రములకు నార, పట్టు, రబ్బరు, టిన్, నిక్కెల్, ఉన్ని, మాంగనెస్, ఆస్‌బెస్టస్.

2. ఫ్రాన్సు:—బొగ్గు, తుత్తునాగము, టిన్‌రేకు, సీసము, మాన్‌గనీస్, నూనె, నైట్రేట్లు, పాదరసం, గంధకం, ప్లాటినమ్.

3. గ్రేటుబ్రిటను:— ప్రత్తి, రాగి, ప్లాటినమ్, గంధకం, వెండి, సౌవీరము, ఎరువులు.

4. హాలండు } ఇనుము, బొగ్గు, ప్రత్తి.
5. ఇటలీ }

6. బెల్జియం:—బొగ్గు, ఫోస్ఫేటు, ఎరువులు.

7 పోర్చుగల్:—బొగ్గు, ప్రత్తి, ఎరువులు.

8. జపాను.—ప్రత్తి, ఇనుము, రబ్బరు, చర్మాలు, ఉన్ని, నార, కాగితం తయారుచేసే కర్ర, నూనె.

ఈ పై సరకుల సప్లయికోసం పైన వివరించిన దేశాలు ఆయాసామ్రాజ్యాలవారికి అవుసరం. అందువల్ల వీరిక్రిందనున్న దేశాలకు స్వాతంత్ర్యం యివ్వలేదు. పైపెచ్చు లోకువగా నుండే దేశాలను క్రొత్తగా దొరికే దీవులను, లంకలను ఆక్రమించుటకు ప్రాకులాడుతూనే ఉంటారు.

# 16 సామ్రాజ్యతత్త్వము-వలసరాజ్యములసమస్య.

1. సామ్రాజ్యము లున్నవారు తమ స్వదేశములోని జనాభా వృద్ధిపొందినప్పుడు వారిని యితర చోట్లకు పంపుటకు,

2. సామ్రాజ్యంయొక్క తల్లి దేశంలోని పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థములను సంపాదించుటకు,

3. ఇతరసామ్రాజ్యములతోపాటు తానుకూడ సామ్రాజ్యతత్త్వంలో వెనుకబడకుండా నుండే గౌరవమైన హోదాకొరకు,

4. సామ్రాజ్యముయొక్క తల్లి దేశములో తయారయ్యే సరకుల విడుదలకొరకు,

5. ఇతర సామ్రాజ్యములతో పోటీకిపోయి తమసరకులను చౌకగా అమ్మకుండా నుండుటకు,

6. యుద్ధసమయములలో చేయు యుక్తి ఉపాయముల కొరకు,

7. సామ్రాజ్యంయొక్క తల్లిదేశములోని ధనమును లాభముకొరకు పెట్టుబళ్లుగా పెట్టుటకు

8. సామ్రాజ్యం యొక్క తల్లిదేశములోని ప్రజలలో ఆర్థిక, రాజకీయములలో కలిగే తగాయిదాలను పెరగకుండా చేయుటకొరకు

సామ్రాజ్యములకు వలసరాజ్యము లుండవలె నని సామ్రాజ్యాధిపతుల వాదమై యున్నది.

---

సామ్రాజ్యములవారిక్రింద అణగంటియున్న
ప్రజలయొక్క వాదము.

---

1. ఆర్థిక, రాజకీయహక్కులలో విదేశీయులు స్వదేశస్థులను అణగద్రొక్కకుండా నుంటూ సంపూర్ణస్వేచ్ఛ నిచ్చి మిత్రభావంతో నుండవలెననియే.

---

# 17. వివిధ దేశాలలోని రాజకీయ పక్షాలు.

---

రాజకీయపక్షాలు ఆయా దేశములలో నుండే వృత్తులను బట్టియు, ఆవృత్తులలోనుండే ధనికులు, మధ్యతరగతి కార్మిక కర్షకులను బట్టియు, పనిలేని సమస్యలను బట్టియు, ఏర్పడు చుండును. యీ వివరములు యీ దిగువను వివరింపబడెను.

వివిధ దేశములలో వివిధవృత్తులలో నున్నవారి సంఖ్య నూటికి.

| దేశములు | వ్యవసాయం చేపల పరిశ్రమ | పరిశ్రమలు వర్తక వ్యాపారము | ప్రభుత్వ నౌకరీ, ఇతర నౌకరీ | ఇంటి పనులు | సైన్యం | ఇతరములు |
|---|---|---|---|---|---|---|
| ఆస్ట్రియా 1920 | 32 | 46 | 11 | 11 | ప్రభుత్వనౌకరీలలో చేరినది. | — |
| బెల్జియం 1920 | 19 | 65 | 7 | 5 | 2 | 2 |
| బల్గేరియా 1926 | 81 | 13 | 3 | 1 | 1 | |
| జెకోస్లోవెక్యా 1920 | 40 | 47 | 5 | 4 | 2 | 2 |
| డెన్మార్కు 1921 | 35 | 44 | 6 | 13 | 1 | 1 |
| ఇంగ్లండు అండ్ వేల్సు 1921 | 7 | 68 | 10 | 12 | 1 | 2 |
| ఎస్తోనియా 1922 | 66 | 19 | [illegible] | 2 | 2 | 7 |
| ఫిన్‌లాండు 1930 | 63 | 2[illegible] | 3 | 2 | 1 | 9 |
| ఫ్రాన్సు 1926 | 38 | 50 | 6 | 4 | 2 | |

| దేశములు | వ్యవసాయం చేపల పరిశ్రమ | పరిశ్రమలు వర్తక వ్యాపారము | ప్రభుత్వ నౌకరీ ఇతర నౌకరీ | ఇంటి పనులు | సైన్యం | ఇతరములు |
|---|---|---|---|---|---|---|
| జర్మనీ 1925 | 31 | 58 | 6 | $4\frac{1}{2}$ | $\frac{1}{2}$ | |
| గ్రీస్ 1928 | 54 | 26 | 4 | 2 | 1 | 3 |
| హాలండు 1920 | 24 | 59 | $7\frac{1}{2}$ | 8 | $\frac{1}{2}$ | 1 |
| ఐస్‌లెండు 1920 | 56 | 23 | $4\frac{1}{2}$ | 15 | | $1\frac{1}{2}$ |
| ఐర్లండు 1926 | 52 | 26 | 6 | 10 | 1 | 5 |
| ఇటలీ 1911 | 56 | :5 | $4\frac{1}{2}$ | $2\frac{1}{2}$ | 2 | |
| లటీలియా 1925 | 68 | 19 | 4 | $2\frac{1}{2}$ | $1\frac{1}{2}$ | 5 |
| లిథూనియా 1923 | 79 | 10 | $1\frac{1}{2}$ | $5\frac{1}{2}$ | $1\frac{1}{2}$ | $2\frac{1}{2}$ |
| నార్వే 1930 | 35 | 48 | 6 | 10 | ప్రభుత్వ నౌకరీలలో కలసెను. | $1\frac{1}{2}$ |
| పోలెండు 1921 | 76 | 15 | $2\frac{1}{2}$ | 2 | $2\frac{1}{2}$ | 2 |
| పోర్చుగల్ 1911 | 58 | 31 | 2 | $7\frac{1}{2}$ | $1\frac{1}{2}$ | — |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| రొమేనియా 1913 | 80 | 13 | 2 | 3 | 2 | — |
| స్కాట్లండు 1921 | 10 | 66 | 6 | 9 | 1 | 8 |
| స్పైన్ 1920 | 56 | 29 | 4 | 3½ | 2½ | 5 |
| స్వీడన్ 1930 | 41 | 45 | [illegible] | 7 | ½ | 1½ |
| స్విట్జర్లండు 1920 | 26 | 61 | 7 | 6 | [illegible]ాకరీలలో కలసెను. | — |
| అమెరికా సంయుక్త రాష్ట్రాలు 1930 | 22 | 51 | 8 | 10 | ½ | 8 గుమస్తాలతో సహా |
| సోవియటు రష్యా 1926 | 87 | 9 | 2 | — | 1 | 1 |
| కనడా | 31 | 41 | 1 | — | — | — |
| జపాను | 50 | 40 | 3 | — | — | — |
| ఇండియా | 72 | 16 | 2 | — | — | — |

♦ ఈ మూడు దేశాల అంకెలు 1925-31 మధ్యను తేల్చినవి అయి యున్నవి.

ఈ వివరాలు జి. డి. హెచ్. కోలుగారి "యూరపు టుడే" అను గ్రంధములోనివివిన్ని

స్టేట్సుమెన్ ఇయ్యరు బుక్కులోనివి ఐ యున్నవి.

యూరపు దేశాలలోని రాజకీయపక్షాలు పేర్లు 1933 వరకు.

| దేశాలు | ప్రభుత్వములోనిపక్షాలు | శాసనసభలోని ప్రజా ప్రతినిధుల సంఖ్య. | సోషలిస్టు లేని పార్టీలు (సామ్యవాదపక్షం లేనివి) | సోష లిస్టు పక్షాలు | కమ్యూని నిస్టు పక్షము. |
|---|---|---|---|---|---|
| అల్బేనియా | నాన్ పార్టీ | 59 | — | — | — |
| ఆస్ట్రియా | క్రిసో, అగ్రే | 165 | క్రిసో 66 అగ్రే 10 | 72 | — |
| బెల్జియం | కాత, లిబ | 187 | కాత 179 లిబ 24 | 73 | 3 |
| బల్గేరియా | నేష | 274 | నేష 155 డెమొ 62 | 5 | 31 లే. |
| జెకోస్లొవేకియా | కొహె (సోష, సహో) | 300 | అగ్రే 62 కాత 44 | సో, 64 | 28 |
| డెన్మార్కు | సోష, రాడి, కొహె | 149 | లిబ 49 కణ 27 | 62 | 2 |
| ఎస్తోనియా | కొహె | 100 | అగ్రే 42 సెంట 23 | 22 | — |
| ఫిన్‌లాండు | కొహె | 200 | అగ్రే 52 నేష 32 | 79 | — |
| ఫ్రాన్సు | రాడి, సోష | 614 | రాడి, సోష 160 | 128 | 10 |
| జర్మనీ | నాజీ (1934 లో అంతా నాజీలే) | 647 | నాజి 288 కాత92 నేష52 | 120♦ | 81♦ |

♦ ఈ గుర్తులు ఎన్నికలలో వోడిపోయిరి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| గ్రేటుబ్రిటను | నేష, కొం హి | 615 | కఞ 470లిబనేష35లిబ33 | 50 | 5ఇ.లే. |
| గ్రీస్ | పాపులర్ | 250 | పాపులర్ 135 లిబ 111 | — | — |
| హంగేరి | యునైటెడ్ | 245 | యునైటెడ్ 148 క్రిసో27 | 14 | — |
| ఐస్‌లెండు | కొం హి | 42 | ప్రొ గ్రె 23 నేష 15 | 4 | — |
| ఐర్లండు | ఫిన్నాపైలు | 153 | ఫిన్నాపైలు170కు మన్న నాగ్గధల 54 | 7 | — |
| ఇటలీ | ఫాసిస్టు | 400 | ఫాసిస్టు 400 | — | — |
| లటేవియా | కొం హి | 100 | అగ్రే 14 | 21 | — |
| లిథూనియా | కొం హి | 85 | పీపిల్సు 22 (కి, డెమొ 14 | 15 | — |
| లక్జంబర్గు | కొం హి | 54 | కాత 25 | 14 | — |
| హాలండు | కొం హి | 100 | కాత 28 | 22 | 4 |
| నార్వే | అగ్రే | 150 | కఞ 41 రాడి 33అగ్రే25 | 47 | — |

| దేశాలు | ప్రభుత్వములోనిపక్షాలు | శాసనసభ లోని ప్రజా ప్రతినిధుల సంఖ్య. | సోషలిస్టులేని పార్టీలు (సామ్యవాదపక్షం లేనివి) | సోష లిస్టు పక్షాలు | కమ్యూని స్టు పక్షము. |
|---|---|---|---|---|---|
| పోలండు | నాన్ పార్టీ యూనియన్ | 444 | నాన్ పార్టీయు247 నేష63 అగ్రే 42 | 24 | 4 |
| పోర్చుగల్ | నాణ్ పార్టీ డైరెక్టరీ | 163 | మోడ డెమొ 85 నేష25 | 2 | — |
| రొమేనియా | నేష, అగ్రే | 387 | నేష అగ్రే247 నేషలిబ28 | 7 | — |
| స్పెయిన్ | సోష, రాడి, సోష, కొహె | 466 | రాడి 89 రాడి సోష 54 కాటలన్సు 43 | 114 | ...... |
| స్వీడన్ | సోష | 230 | కణ 58 అగ్రే 36 | 104 | 8 |
| స్విట్జర్లండు | కొహె | 187 | రా. డె. 52 కా. క. 44 | 49 | 3 |
| టర్కీ | పీపిల్సు | 317 | పీపిల్సు 304 | — | — |
| సోవి-రష్యా | కమ్యూనిస్టు | 472 | — | — | — |
| యుగోస్లేవియా | నేష | 305 | నేష 305 | — | — |

(అగ్రే=అగ్రేరియన్, అనగా వ్యవసాయమునకు సంబంధించిన, కాత=కాతలిక్, అనగా సర్వజనసమ్మతమైన,క్రి. సోష= క్రిష్టియన్ సోషల్, అనగా క్రైస్తవసామ్యవాదము అంటే సర్వజనులకు ధనము సమానముగా నుండునట్లు జేయుట. కోహి=కోహిలిషను, అనగా కొన్నిపక్షములవా రంతా కలసి ఏకమైనసంఘము. కన్=కెన్సర్వేటీవ్సు=పూర్వాచార సాంప్రదాయ పక్షకులు; అంటే మార్పులకు యిష్టపడనివారు.

డెమొ=డెమొ కేట్రిక్ అనగా ప్రజాప్రభుత్వవాదులు లేక ప్రజాపాలితమైన, లిబ = లిబరల్ అనగా జనులకు అధిక స్వేచ్ఛనియ్యవలె ననువారు. మోడ=మోడరేట్ అనగా మితవాదులు, నేష = నేషనల్ అనగా జాతీయవాదులు, నాన్ పార్టీ = ఏపక్షమునకు చెందనివారు. ప్రోగ్రె = ప్రోగ్రెస్సీవు అనగా అభివృద్ధి చెందవలెననుపక్షము. రాడి=రాడికల్ అనగా రాజ్యపాలనయందు సమూలముగ మార్పులు చేయవలెనను వారు. ఈవివరాలు జి.డి. హెచ్. కోలుగారి "యూరపు టుడే" అను గ్రంథంలోనివి.)

పైన వివరించిన రాజకీయ పక్షములనుబట్టి ఆయాదేశములలోనుండే వ్యవసాయ పారిశ్రామిక వృత్తులనుబట్టియు అందులకు సంబంధించిన కార్మిక, కర్షకులనుబట్టియు ఏర్పడినవని స్పష్టపడుచున్నది. ప్రభుత్వపరిపాలనలో తరచుగా ప్రజా

అవసరకార్యములనుబట్టి రాజకీయ పక్షాలు ఏర్పడుచున్నవని యు తేలుచున్నది. ఇట్టి స్థితిగతులనుబట్టి రాజకీయపక్షా లుండ కుండా జేయడమనేది వట్టికల్ల యని తెలుసుకోవలెను. రాజ కీయపక్షాలుండడంలో దేశముయొక్క ఆర్థిక, సాంఘిక, రాజ కీయ సౌభాగ్యములో ప్రజా సామాన్య మంతయు సరిసమాన గౌరవప్రపత్తులతో అనుభవించుటకు తోడ్పడే రాజకీయపక్షా లేవి యుండునో అట్టివాటికే విలువ, పలుకుబడి, యుండునుగాని మిగతావి నామకార్థంగానే యుండుననియు అట్టివాటివల్ల ప్రజల కుపయోగములేదనియు స్పష్టపడుచున్నది. అంతే గాక ఋజువగుచున్నది.

### పక్షసిద్ధాంతముల ప్రచారము.

రాజకీయపక్షసిద్ధాంతముల ప్రచారమునకుగాను వార్తా పత్రికలు, ఉపన్యాసములు, గ్రంథములు, కరపత్రములు మున్నగునవి ఆయాపక్షములకు సంబంధించిన వ్యక్తులుగాని లేక కొందరు కలసి గాని లేకఅట్టిపక్షము తరపునగాని యిట్టి ప్రచురణలు జరిపించుటయు ఉపన్యాసములను బహిరంగసభలలో గలిగించుటయు జరుగుచుండును. ఈ పక్షసిద్ధాంతములలో ఏవి ప్రజాసామాన్యమంతటికి అనుకూలముగ నుండునో అట్టివాటిని ప్రజలు విమర్శనలపై తేల్చుకొని అట్టిపక్షమునకే బహిరంగము గనో పరోక్షముగనో సహాయము చేసి దాని అభివృద్ధికి పాటుబడడం గలదు.

# 1. గత మహాసంగ్రామము రాబోవు యుద్ధాలను ఆపినదా?

గత మహాసంగ్రామముతో ఇకను యుద్ధాలు రాకుండా జేయాలని యూరపులోని రాజకీయవేత్తలు ఏర్పాట్లు చేసిరి. ఆఏర్పాట్లలో కలిగే అసంతుష్టివల్లనే రాబోవు యుద్ధమునకు కారణమగుచున్నదని యూరపు రాజకీయవేత్తలే యిపుడు అంటున్నారు. వీటిని గూర్చి విపులముగా తెలుపుటకు అందుకు తగిన చరిత్రాంశము లిందు వివరింపబడెను.

## గత మహాసంగ్రామము కలుగుటకుగల కారణము.

28 జూన్ 1914న 19 వత్సరముల వయస్సుగల సెర్బియన్ విద్యార్థి ఆస్ట్రియా యువరాజగు ఫ్రాన్సిస్ ఫెర్డినెండు అను వానిని చంపెనను నేరముతో 1914-18 వరకు యూరపులో మహాసంగ్రామము జరిగెను. ఈయువరాజును చంపినందులకు కారణం జర్మనీ అనే కారణంతో జర్మనీచుట్టు నున్న దేశాల వారు ఒక్కపెట్టున జర్మనీని ముట్టడించుటకు యత్నించగా, జర్మనీ యుద్ధంలోకి దిగవలసివచ్చెనని ఇపుడు జర్మనీ పరిపాలకవర్గంలో నున్న జనరల్ గోరింగు (హిట్లరు నియంత యొక్క మంత్రివర్గములో ఒకడు) తాను "జర్మనీ రీబోర్న్" అను పేరిట వ్రాసిన పుస్తకంలో వ్రాసెను.)

గత ప్రాపంచక మహాసంగ్రామము.

యుద్ధప్రారంభము 1 ఆగష్టు 1914.

యుద్ధము ఆగుట 11 నవంబరు 1918.

యుద్ధము జరిగినకాలము 4 సం॥ 3 నె॥ 11 రో॥

యుద్ధములో పాల్గొన్న ముఖ్య దేశాలు 21

యుద్ధములో చనిపోయిన జనాభా 11 నవంబరు 1918 నాటికి ఒకకోటి 74,50,200.

యుద్ధమునకు అయినసొమ్ము 30 ఏప్రియల్ 1919 నాటికి 186,000,000,000 డాలర్లు. డాలరు అనగా రమారమి రు 3 లు.

భారత దేశము యీ యుద్ధములో ఇంగ్లండువారికి 15 లక్షల మనుష్యులను 150 కోట్ల రూపాయలను సహాయముగా యిచ్చెను. ఇచ్చిన మనుష్యులలో ఒకలక్ష చనిపోయిరి. ఇచ్చినడబ్బులో ప్రతిమనిషి దామాయిషాను రు 5 లు చొ॥ యిచ్చెనన్నమాట.

యుద్ధములో సరాసరిగా పాల్గొన్న దేశాలు.

| ఈ 4 ఒకపక్షము | ఈ 17 ఒకపక్షము. |
|---|---|
| 1 జర్మనీ | 1 అమెరికా సంయుక్త రాష్ట్రాలు. |
| 2 ఆస్ట్రియా-హంగేరీ | 2 గ్రేటుబ్రిటను |

| | |
|---|---|
| 3 టర్కీ | 3 కనడా |
| 4 బల్గేరియా | 4 ఇండియా |
| | 5 ఆస్ట్రేలియా |
| | 6 న్యూజిలండు |
| | 7 దక్షిణాఫ్రికా |
| | 8 ఫ్రాన్సు |
| | 9 రష్యా |
| | 10 బెల్జియం |
| | 11 సెర్బియా |
| | 12 మాన్ టెనెగ్రో |
| | 13 జపాను |
| | 14 ఇటలీ |
| | 15 రుమేనియా |
| | 16 పోర్చుగల్ |
| | 17 గ్రీస్ |

అంతర్జాతీయ సంఘం (లీగ్ ఆఫ్ నేషన్సు) వెర్సల్లీసు సంధితో పాటు ఏర్పడ్డా అమలులోనికి 10 జనవరి 1920 లో వచ్చెను. దీనిని అమెరికా సంయుక్తరాష్ట్రముల అధ్యక్షుడు విల్సన్, దక్షిణాఫ్రికాలోని జనరల్ స్మట్సు సేనాని, సెసిల్ ప్రభువు యోచించి నిర్మించిరి. దీనిద్వారా ప్రపంచక శాంతి చేకురుతుం దన్నారు. కాని అదిమాత్రం జరగడం లేదు

రాబోవు యుద్ధానికి తయారులో నుండే దేశాలను ఏమి చేయ డంలేదు. పెద్ద దేశాలు చిన్న దేశాలను ఆక్రమిస్తూవుంటే చూస్తూ వూరుకోవడం జరుగుతోంది. ఇందువల్ల దీని ఆశయాలు కాగితంమీదనే వున్నాయి గాని అమలులో లేవు. దీని ముఖ్యస్థానము స్విజర్లండు దేశములోని జనీవా పట్టణమం దున్నది. సాలుకు మూడుసార్లు సమావేశ మగుచుండును.

ఇందులో సభ్యులుగా నున్న దేశాలు:—

1. అబ్సీనియా, 2. ఆఫ్ గన్ స్థానము, 3. అల్బేనియా, 4. ఆర్గెన్ టీనా, 5. ఆస్ట్రేలియా, 6. ఆస్ట్రియా, 7. బెల్జియం, 8. బొలీవియా, 9. బల్గేరియా, 10. కెనడా, 11. ఛిల్లె, 12. చైనా, 13. కొలంబియా, 14. కూబా, 15. శ్చెకుస్లో విక్యా, 16. డెన్మార్కు, 17. డొమినికన్ రిపబ్లిక్, 18. ఎస్తో నియా, 19. ఈక్వడోర్, 20. ఫిన్ లాండు 21. ఫ్రాన్సు, 22. గ్రేటుబ్రిటను, 23. గ్రీసు, 24. గుఆటెమలా, 25. హైటి, 26. హాండురాస్, 27. హంగేరీ, 28. ఇండియా, 29. ఐర్లండు, 30. ఇటలీ, 31. ఇరాక్, 32. లాటివియా 33. న్యూజిలెండు, 34. నికారాగుఆ, 35. నార్వే, 36. పెనామా, 37. పారా గువె, 38. పెర్షియా, 39. పేరు, 40. పోలండు, 41. పోర్చుగల్, 42. రుమోనియా, 43. సాల్ వాడోర్, 44. సయాం, 45. దక్షిణాఫ్రికా, 46. సోవియట్టురష్యా, 47. స్పైను, 48.

స్వీడన్, 49. స్విజర్లండు, 50. టర్కీ, 51. ఉరుగుఆర్వై, 52. వెనెజుఎలా, 53. యుగుస్లోవియా, 54. ఈజిప్టు, 55. సిరియా.

ఇందులో చేరని దేశాలు.

1. బ్రెజిల్, 2. కోస్టారికా, 3. ఐస్‌లాండు, 4. జపాను, 5. నేపాల్, 6. సౌదీఅరేబియా, 7. హెడ్జాజ్, 8. టిబెట్టు, 9. అమెరికా సంయుక్తరాష్ట్రాలు, 10. జర్మనీ

జపాను మొదటనే సభ్యుడుగా చేరి, చైనా జపానుకు వచ్చిన తగాయిదాలో జపాను తన సభ్యత్వమును వదలు కొనెను. అమెరికా సంయుక్తరాష్ట్రాలఅధ్యక్షునివల్ల యీఅంత ర్జాతీయసంఘం ఏర్పడ్డా తన మన్రోడాక్ట్రిన్ అనుదానివల్ల అమెరికా సంయుక్తరాష్ట్రాలు చీలికలు కలుగలేదు. మన్రో డాక్ట్రిన్ అనగా అమెరికా దేశము యితర దేశాలతో జోక్యం కలుగ జేసుకోకుండా నుండేరీతిని నొకచట్ట ముండెను. అది రద్దైనగాని యిందు చేర వీలులేదు. అది రద్దు చేసుకోవడానికి యిష్టంలేదు. అందువల్ల సభ్యత్వమును పొందలేదు.

ఈసంఘంలో నొకాసభ్యులంతా ఆయాదేశపు ప్రభు త్వముల తరపున సాలీనా కొంతసొమ్మును చెల్లించుచుతూ వుండ వలెను.

ఇండియాదేశము చెల్లించినసొమ్ము యీ దిగువ వివ రింపబడెను.

# ఇండియా-అంతర్జాతీయ సంఘము

—o—

1924-35 లగాయతు ఇండియాయొక్క ఆదాయము నుండి ఖర్చు అయిన సొమ్ము.

| | | రూ. |
|---|---|---|
| 1924-25 | కార్మికసభా సందర్భంలో | 27125 |
| 1925-26 | డిటో | 16859 |
| 1926-27 | డిటో | 25780 |
| ,, | ఇండియన్ డెలిగేషను | 12114 |
| 1927-28 | లీగ్ సభకు | 42934 |
| ,, | కార్మిక సభకు | 25663 |
| 1928-29 | లీగ్ సభకు | 8686 |
| ,, | కార్మిక సభకు | 29714 |
| 1929-30 | లీగ్సభకు | 8403 |
| ,, | కార్మిక సభకు | 87616 |
| 1930-31 | లీగ్సభకు | 50552 |
| ,, | కార్మిక సభకు | 44449 |
| 1931-32 | లీగ్సభకు | 21428 |
| ,, | కార్మిక సభకు | 43918 |

| | | |
|---|---|---|
| 1931-33 | ఆయుధ విసర్జనసభకు (డిజార్మమెంటు కాన్ఫరెన్సు) | 4320 |
| 1932-33 | లీగ్ సభకు | 3641 |
| ,, | కార్మిక సభకు | 15111 |
| ,, | ఆయుధవిసర్జన సభకు | 5694 |
| 1933-34 | లీగ్ సభకు | 2320 |
| ,, | కార్మిక సభకు | 14967 |
| ,, | ఆరోగ్య శిశుసంరక్షణ సభకు డెలిగేషను | 1358 |
| ,, | ఆయుధ విసర్జనసభకు డెలిగేషన్ | 173 |
| 1934-35 | లీగ్ సభకు | 630 |
| ,, | కార్మిక సభకు | 19491 |
| ,, | ఆరోగ్య శిశుసంరక్షణ సభకు | 460 |
| 1935-36 | లీగ్ సభకు | 3034 |
| ,, | కార్మిక సభకు | 32700 |
| ,, | పసిపిల్లలకు యువకులకు రక్షణసభకు కమీషనుగా... | 1752 |

పై అంకెలు అసెంబ్లీ సభ్యుల ప్రశ్నలకు ఇచ్చిన జవాబులలో వుండెను. ఇండియా ఇంగ్లండువారి ఆధీనమం దుండెను గాన స్వాతంత్ర్యంలేదు. బ్రిటీషుప్రభుత్వంవారు యీ అంతర్జాతీయ సంఘసభలకు హాజరయ్యే ప్రతినిధులను నామినేటు చేస్తారు (నియామకం). అంతేనే గాని ఇండియా

సామ్రాజ్య సభనుండి ఎన్నుకొనే హక్కునైనా యియ్యలేదు. దీనినిబట్టి ఇండియా తరపున నామినేషనుతో వెళ్ళే ప్రతినిధి ఇంగ్లండుకు తోకగా నుపకరించునే గాని స్వాతంత్ర్యంతో ప్రవర్తించుటకు వీలుండదు. స్వాతంత్ర్య ప్రియులను నామినేటు చేయరన్న సంగతి వేరుగ చెప్పవలెనా! లేబరు కాన్ఫరెన్సు తీర్మానములను ఇండియాప్రభుత్వం అమలుపరచుటలో ఇంత వరకు బాగా శ్రద్ధను జూపలేదు. రోజుకు 12 గంటలు పని చేయు ఏర్పాట్లు యిప్పటికిని గలవు. ఉదయము 7 గంటలు లగాయితు గాని లేక 8 లగాయితుగాని సాయంకాలము 7 లేక 8 గంటల వరకు పని చేయు ఏర్పాట్లు రైల్వే డిపార్టుమెంటులోను, జాయింటు స్టాకు కంపెనీలలోను పనిచేసే గుమాస్తాలకు యీ బాధలు తప్పలేదు. ఇట్టివారికి విశ్రాంతికాలము రాత్రి 12 గంటలే లెక్కలలో జూపుతుంటారు. శారీరకముగ పని చేయు కూలీలకు ఉదయము 6½ లేక 7 లగాయితు మధ్యాహ్నము 12½ వరకున్ను మధ్యాహ్నము 2 లగాయితు సాయంకాలము 6 వరకున్నూ వెరశి 10 గంటలు లేక 11 గంటలు పనిచేయు ఏర్పాట్లు తగ్గనేలేదు. ఇదిగాక కర్షక కూలీల విషయంలో యీ అంతర్జాతీయ కార్మికసభ ఏమియు శ్రద్ధను వహించనేలేదు. భారతదేశంలో నుండే కూలీలలో కర్షక కూలీలే నూటికి 80 మందివరకున్నారని చెప్పవచ్చును. ఈ అంశములనుబట్టి ఇండియాకు అంతర్జా సంఘమున

కుండే సంబంధం నామకార్థంతప్ప మరేమియు లేదని స్పష్టపడు తోంది.

## అంతర్జాతీయ న్యాయస్థానము.

అంతర్జాతీయ సంఘంవల్లనే ఆంగ్లమున పిలువబడే యీ ఇన్‌టర్‌నల్ కోర్టు ఆఫ్ జస్టీసు ఏర్పడెను. ఇది హాలండునందున్న హేగ్ పట్టణమందుండెను. 1922 మెయిలో ఏర్పడెను. అంతర్జాతీయముగ వచ్చే దేశాలయొక్క తగవులకు తీర్పు చెప్పును. ఈ తీర్పులకు బద్ధులవవలెనను శాసన మేదియు లేదు. ఇదికూడ లీగ్ ఆఫ్ నేషన్సు వలెనే మరో సలహాసంఘము గనే ఉన్నది. ప్రస్తుతంలో యిందు 15 గురు జడ్జీ లున్నారు. ఒక్కొక్కనికి నెల 1 కి 1500 డచ్చిఫ్లారిన్సు (డచ్చి నాణెములు) యియ్యబడును.

## అంతర్జాతీయ కార్మికసంఘం.

అంతర్జాతీయ సంఘంలో ఇది ఒకశాఖ. ఈ శాఖ తరఫున ప్రతి ఏటా సభలు జరిపి అందు కార్మిక సమస్యలను పరిష్కారం చేస్తూవుంటారు. ఈ సభాతీర్మానములను ఐచ్ఛికముగ వివిధదేశాలు అనుసరించవలెనేగాని అనుసరించకపోతే అనుసరించేటట్లు చేసే శాసనములు ఏవియు లేవు.

# 2. 1919 సం॥రం నుండి జర్మనీస్థితి.

18జనవరి పారిస్ నగరమున (ఫ్రాన్సు దేశపు ప్రధాన పట్టణము) శాంతిసభకు ప్రారంభదినముగా పరిగణింపబడెను. 28 జూన్ వెర్సల్లీసు అను ప్రదేశమున (ఫ్రాన్సులోనిది) వెర్సల్లీసు సంధి యనునది ఏర్పాటయ్యెను. ఈసంధిద్వారా యీ మహాసంగ్రామములో ఓడిపోయిన జర్మనీదేశమునకు ప్రజాప్రభుత్వపరిపాలన ఏర్పాటయ్యెను. ఈయేర్పాటు జూలై నెలలో వైమార్ అను ప్రదేశమునుండి ప్రచురింపబడెను. అందువల్లనే యీనూతన జర్మనీరాజ్యాంగచట్టమునకు వైమార్ ఆక్టు (చట్టము) అని పేరు వచ్చెను.

ఈ వెర్సల్లీసు సంధివల్ల జర్మనీ సరిహద్దు ప్రదేశాలలో యీాదిగువవాటిని ఆయా దేశములవారు కలుపుకొన్నారు.

1. ఉత్తరాన్ని శ్లెస్విగ్ అను ప్రదేశమును డెన్మార్కు దేశమునకు కలిపిరి.

2. పడమర యూపెన్ ప్రదేశాన్ని మాల్మెడీప్రదేశాన్ని బెల్జియందేశమునకు కలిపిరి. ఇచ్చట ప్రజలకు బెల్జియంలో చేరుటకు ఇష్టంలేకపోయినా,

3. పడమర లొరైనె అల్సాసె ప్రదేశాలను ఫ్రాన్సునకు కలిపిరి.

4. పడమరనున్న సార్ ప్రదేశాన్ని అంతర్జాతీయ

సంఘం యాజమాన్యమున (లీగ్ ఆఫ్ నేషన్సు) 15 వత్సరము లుండవలె నన్నారు. అటుపిమ్మట ప్రజాభిప్రాయ ప్రకారం ఫ్రాన్సునకుగాని లేక జర్మనీకిగాని చెందవచ్చునన్నారు. 1935 ఫిబ్రవరిలో నూటికి 90 మంది జర్మనీలో చేరుటకు అంగీకరించి నందున జర్మనీలో యీ ప్రదేశము చేరెను.

5. తూర్పున అప్పర్ సిలేసియాలో కొద్దిభాగము శ్చెకోస్లోవిక్యా దేశమునకుకలిపిరి. పెద్దభాగమంతా పోలండునకు 1921 లో చేరెను. ఈ ప్రదేశంలోనిప్రజలకు యిది యిష్టం లేదు.

6. పోలండునకు కొంతభాగము పోలండుప్రక్కనేయున్న పోజెన్ ప్రదేశమును కొరిడోర్ అనునవియు కలిపిరి. యీ ప్రదేశమువల్లనే పోలండుకు, బాల్టిక్ సముద్రములోనికి రహదారీ ఏర్పడెను.

7. తూర్పున డాన్ జిగ్ అను పట్టణమును అంతర్జాతీయ సంఘపరిపాలనలో నుంచిరి. ఇది ప్రస్తుతము స్థానికంగానుండే జర్మన్ నాజీపక్షపరిపాలనలోనే వున్నది.

8. మేమెల్ భూప్రదేశము - ఇది మొదట అంతర్జాతీయ సంఘపరిపాలనలో నుండి 1923 లో లిథూనియా దేశమునకు కలిపిరి.

ఈ 8 ప్రదేశాలు జర్మనీకి ఆయువు పట్టుగా నుండెను. వీటిల్లో బొగ్గుగనులు ఉండుటచే పారిశ్రామికముగ ముఖ్య

ప్రదేశములుగ నుండెను. ఇవి పోవడంతోటే జర్మనీ ఆర్థికంగా క్రుంగిపోయెను.

1924 నాటికి జర్మనీ యియ్యవలసిన యుద్ధఋణము 1,000,000,000 పౌనులు అని తేల్చిరి. (పౌను అనగా అప్పట్లో రమారమి రు 14 లు.) అసలు తేల్చినఅంకె 6,000,000,000 పౌనులు-ఈఋణమునకు గాను 1921 మార్చిలో జర్మనీ చెల్లించే వాయిదాను చెల్లించలేకపోయెను. 1923 జనవరి, ఆగస్టు నెలల లో జర్మనీలోకువనుబట్టి ఫ్రాన్సు జర్మనీక్రిందనున్న రుహారు ప్రదేశాన్ని ఆక్రమించెను. ఇది బొగ్గుగనులకు ప్రసిద్ధి అయిన ప్రదేశము.

1924 మార్చిలో డాయెస్ ఆర్థిక పథకాళిక ప్రకారం ఋణంక్రింద జర్మనీకి వచ్చే ఆదాయములో కొంతభాగము వస్తుసామాగ్రిని బంగారముక్రిందయిచ్చుటకు నిర్ణయమయ్యెను.

1924 అక్టోబరులో జర్మనీ ఆర్థికపరిస్థితులు చక్కబడు టకు గాను అంతర్జాతీయఅప్పు అనుపేరట జర్మనీకి ఋణ మిచ్చుటకు వప్పుకొనిరి. ఈఅప్పును రమారమి 45000000 పౌనులవరకు యిచ్చుటకు అంగీకరించిరి. ఈ సొమ్ము హెచ్చు గా అమెరికా సంయుక్తరాష్ట్రములు, కొంత ఇంగ్లండు కలిసి యే యిచ్చిరి.

1925 అక్టోబరులో లోకార్నోప్రదేశమువద్ద మరో సంధి ఏర్పడెను. ఈసంధివల్లనే 1926 సెప్టెంబరులో జర్మనీని

అంతర్జాతీయ సంఘంలో సభ్యునిగా చేర్చిరి. కాని తగినంత గౌరవము యీసభ్యత్వమునకు అప్పట్లో లేదు.

1930లో నాజీపార్టీకి జర్మనీ దేశపు ఎన్నికలలో విజయము చేకూరెను. దీనికే నేషనల్ సోషలిజము అని ఆంగ్లమున పేరు. అనగా జాతీయసామ్యవాదము అని తెలుగున అందురు. దీనికి నాయకుడు హెర్ హిట్లర్. ఈతడు 1933 లో పరిపాలకుడుగ వచ్చి జర్మనీదేశపు పూర్వపుపరిపాలన (ప్రజాప్రభుత్వముగ) అంతటిని మార్పుజేసి తానే నియంత అయి (డిక్టేటరు) జర్మనీకి పూర్వపుఔన్నత్యమును తెచ్చుటకు కంకణముగట్టి 1936 లో రైనులాండునందు ప్రవేసించెను. పోయినప్రదేశాలను వలస రాజ్యాలుసహా రాబట్టుటకు యత్నించుచుండెను. జర్మనీఅన్న మధ్యయూరపుదేశాలకు హడలెత్తునట్లు చేయుచుండెను. ఈనాజీపార్టీకి ఆయువుపట్టు యువకసంఘాలే.

---

# 3. గత మహాసంగ్రామమువల్ల యీదిగువ నాల్గు సామ్రాజ్యాలు విచ్ఛిన్న మయ్యెను.

## 1. రష్యాసామ్రాజ్యము.

ఈ దేశముయొక్క పడమటిభాగము 1918లో జర్మనీకి కలుపబడెను. దీనివల్ల కొంతభాగము రష్యాకు తగ్గిపోయెను.

1917లో చక్రవర్తి పరిపాలనపోయి సాంఘిక సామ్యవాదపరిపాలన ఏర్పడెను. (సోవియట్టు పరిపాలన) ఈ వివరములు ముందు పేజిలలో తెలియగలవు.

## 2. ఆస్ట్రియాసామ్రాజ్యము.

ఇది గత మహాసంగ్రామములో జర్మనీపక్షమున్నందున వెర్సల్లీసు సంధిద్వారా యీరాజ్యమును విడదీసి దీనిచుట్టూ 5 ప్రత్యేక దేశాలను నిర్మించిరి.

1. ఉత్తరమున కొంతభాగమును పోలండుకు కలిపి పోలండుదేశమును నిర్మించిరి.

2. ఉత్తరమున మరికొంతభాగమును విడదీసి శ్చెకోస్లోవిక్యా అనుదేశముగ నిర్మించిరి.

3. తూర్పున కొంతభాగమును రుమేనియాకు కలిపి రుమేనియాదేశముగ నిర్మించిరి.

4 ఎ. దక్షిణమున టైరోలు అనుప్రదేశమునున్నూ, ఈస్ట్రియన్ అనుద్వీపకల్పము (మూడువైపుల సముద్రము ఒకవైపు భూమి వున్నప్రదేశము) నున్నూ ఇటలీకి కలిపిరి. ఇటలీ గత మహాసంగ్రామములో ఇంగ్లండు, ఫ్రాన్సులకు సహాయం చేసెనుగాన యీకాస్తా ఇటలీకియిచ్చిరి. ఇది ఇటలీని సంతుష్టిపరచలేదు.

4బి. దక్షిణముననున్న సెర్బియాకు కొంతభాగమును చేర్చి దీనినే యుగోస్లావియా అనుదేశముగ నిర్మించిరి.

5. పైభాగములుపోను మిగతాది ఆస్ట్రియాదేశముగను

6. హంగేరీ దేశముగను నిర్మించిరి.

ఈవిభజనవల్ల ఆస్ట్రియా హంగేరీ అను రెండుదేశములు చిన్నవియై ఉక్కిరి బిక్కిరిగా నుండునట్లు చుట్టూవుండే చిన్న దేశాలవల్ల అయిపోయెను. ఈస్థితిలోనున్న ఆస్ట్రియా హంగేరీలను అటు జర్మనీ ఇటు ఇటలీదేశములు కలుపుకోవలెనని యత్నించుచుండెను. ఈయత్నాలలో ఇటలీ తనయత్నమును మానుకొనెను. జర్మనీ మానుకోలేదు. జర్మనీయొక్క నాజీపరి పాలనాసిద్ధాంతమే ఆస్ట్రియా హంగేరీలలో వ్యాపించు చుండెను.

## 3. టర్కీసామ్రాజ్యము.

టర్కీ గత మహాసంగ్రామములో జర్మనీ పక్షమున నుండెను. ఇందువల్ల వెర్సయిల్లీసు సంధిద్వారా టర్కీసామ్రాజ్యములోని యీ దిగువభాగములను ఆయాదేశములకు కలిపిరి.

1. కొన్నిదీవులు ఇటలీకి కలిపిరి.
2. సిరియాను ఫ్రాన్సుకు కలిపిరి.
3. పాలెస్తైనాను } బ్రిటిషువారికి కలిపిరి.
4. ట్రాన్సుజోర్డాను }

5. ఇరాకు మొదట బ్రిటనునకు కలిపిరి. తర్వాత ఇరాకునకు స్వాతంత్ర్యమిచ్చిరి. కాని యీ స్వాతంత్ర్యం పూర్ణాధికారంతో గాక బ్రిటనుచెప్పుచేతలలో నుండినట్లు గానే ఉంది.

6. ఇబాన్‌సాద్ (అరేబియా)నకు కొంతకలిపిరి.

యుద్ధానంతరము టర్కీలో కెమల్‌పాషా అధికారం లోనికివచ్చి జాతీయతత్త్వముతో ప్రజలను తయారుచేసి టర్కీని ఆర్థిక, సాంఘిక, రాజకీయముగ తగినంత ఔన్నత్యములోనికి తెచ్చి టర్కీ అన్న యితర దేశాలు యిదివరకువలె చులకనగా జూచునట్లు జూడకుండా జేయగలిగెను.

4. జర్మన్ సామ్రాజ్యము.

యిది ఏలా విచ్ఛిన్నమైనది పైన వివరించబడెను

బల్గేరియా దేశము.

గత మహాసంగ్రామములో యిది జర్మనీ పక్షమున నుండెను. ఇందువల్ల దక్షిణభాగములోని కొంతప్రదేశమును వెర్సైల్లీసు సంధిద్వారా గ్రీసుదేశమునకు కలిపిరి. ఇందువల్ల బల్గేరియా చిన్నదై పోయెను.

# 4. గత మహాసంగ్రామమువల్ల ఏర్పడిన నూతన దేశాలు.

1. ఫిన్‌లాండు 1917 జూలై 20ని ప్రత్యేక దేశంగా ఏర్పడెను.

2. ఎస్తోనియా
3. లాట్వియా } పూర్వపు బాల్టిక్ స్టేట్సు
4. లిథూనియా

5. పోలెండు
6. జెకోస్లోవేకియా ♦
7. ఆస్ట్రియా
8. హంగేరీ
9. రుమేనియా ♦
10. యుగుస్లోవియా ♦

ఈ పదిదేశాలు సోవియట్టురష్యా జర్మనీదేశాల సరిహద్దులలో నేర్పాటు కాబడెను. ఇటుల ఏర్పాటు అగుటకు గల కారణాలు జర్మని గాని సోవియట్టురష్యా గాని తలఎత్తకుండా నుండుటకు చిన్నచిన్న దేశాలు ఏర్పడెను.

ఈ ఏర్పాటువల్ల ఆస్ట్రియా, హంగేరీ, బల్గేరియా, టర్కీ దేశాలు వెనుకటికన్న చిన్నవైపోయెను. రుమేనియా గ్రీసుదేశాలు వెనుకటికన్న పెద్దవయ్యెను.

---

♦ గుర్తుగల దేశాలకు లిటిల్ ఎన్‌టెంటీస్ అని పేరు.

కాని యీగత మహాసంగ్రామమువల్ల నాల్గు మహా సామ్రాజ్యాలు విచ్ఛిన్నమై ప్రజాప్రభుత్వపరిపాలనతో చిన్న చిన్న దేశాలు పదిదాకా ఏర్పడినవనే సంతోషమేగాని యీ 10 దేశాలు ఆర్థికంగా తగినంత స్వేచ్ఛతో లేకుండా సామ్రాజ్యాధిపతులుగనున్న బ్రిటను, ఫ్రాన్సు, అమెరికా దేశాలవారి యొక్క పెట్టుబడిసొమ్ముమీదనే ఆధారపడి వున్నవి.

యీ పదిదేశాలలో 1. లటేవియా 2. లిథుయేనియా 3. పోలండు దేశాలలో జర్మనులు, రష్యనులు గలరు. మిగతా దేశాలలో 4. శ్జెకోస్లోవిక్యా 5. హంగేరీ 6. రుమేనియా దేశాలలో జర్మనులు గలరు. ఈ కారణాలవల్ల యీ దేశాలను జర్మనీ తనవైపునకు లోబరచుకొన యత్నించుచుండెను. వీటిని జర్మనీ లోబరచుకుంటే సోవియట్టు రష్యాకు జర్మనీవల్ల ఎక్కడ ముప్పువచ్చునో అనుభయం సోవియట్టురష్యాకుండెను. అందువల్లనే సోవియట్టురష్యా ఫ్రాన్సుతోను బ్రిటనుతోను అమెరికాతోను స్నేహంచేసెను. సో[illegible] సామ్రాజ్యమునకు ఎక్కడ భంగంకలుగునో అనుకారణంతో జపాను జర్మనీతో స్నేహంచేసెను. సోవియట్టురష్యాను అటుజపాను ఇటుజర్మని కలసి నొక్కాలనే కోరికఉంది. ఈ ఇద్దరికి కొరుకుపడకుండా సోవియట్టురష్యా తగినంత సాధనసామాగ్రిని చేసుకొంటూ వుంది.

# 5. శాంతిసభను ఏర్పాటుచేసిన నలుగురు పెద్దలు.

(1) లాయిడు జార్జి. అప్పట్లో బ్రిటీషు ప్రధానమంత్రి.

(2) విల్సన్ (అమెరికా సంయుక్తరాష్ట్రాల అధ్యక్షుడు)

(3) క్లైమాన్‌కో (అప్పట్లో ఫ్రాన్సు ప్రధానమంత్రి)

(4) ఆర్లాండో (అప్పట్లో ఇటలీ కౌన్సిలుయొక్క అధ్యక్షుడు.)

శాంతిసభవల్ల కలిగిన సంధిపత్రాలు.

(1) జర్మనీతో వెర్సల్లీసు అనే ప్రదేశమున జూన్ 1919 నిన్ని.

(2) ఆస్ట్రియాతో సెంటు జెర్మైన్నువద్ద 1919 సెప్టెంబరు నెలలోను

(3) బల్గేరియాతో నెయుల్లీ అను చోట నవంబరు 1919 లోనున్ను.

(4) హంగేరీతో ట్రియినన్‌వద్ద జూన్ 1920 లోను

(5) టర్కీతో సెవ్రెస్‌వద్ద 1920 ఆగష్టులో జరిగెనుగాని యిది ఆమోదింపబడలేదు. లాసానెవద్ద 1923 జూలైలో మరొకటి జరిగెను.

ఇంగ్లండు ఫ్రాన్సు దేశాలకు వ్యతిరేకంగా గత మహా సంగ్రామములో నున్న యీ పై అయిదు దేశాలతో ఆయా దేశాలకు యిష్టంలేని సంధిని తమసామ్రాజ్య ప్రాబల్యంవల్ల తమకు యిష్టమైన షరతులతో సంధిని గావించుకొనిరి. అందువల్లనే నేటి యూరపులోని అశాంతికి కారణమని చరిత్రకారులు వక్కాణించి చెప్పుచున్నారు.

---

# 6. ఇటలీ దేశము.

గత మహాసంగ్రామములో ఇటలీ ఇంగ్లీషు, ఫ్రాన్సు దేశాలకు సహాయం చేసెను.

యుద్ధానంతరమందు ఇటలీని సంతుష్టిపరచేలాగున ఫ్రాన్సు, బ్రిటను, అమెరికా దేశస్థులు ఇటలీకి కావలసిన ప్రదేశాలను యియ్యలేదు. యుద్ధానంతరమంగా ఇటలీ ఆర్థికంగా నష్టపడెను. దీనివల్ల 1919–20 సామ్యవాదము ప్రబలెను. 1921 లో సామ్యవాదపక్షంలో చీలికలు కలిగెను.

దీని ఫలితం 1922 లో మస్సోలినీ రోమునగరంపై దాడి వెడలి అధికారమును చేబట్టి ఫాసిస్టుతత్వమును, (సామ్రాజ్యతత్వమును) అమలులోకి తెచ్చుటకు యువకులను చేబట్టి వారిలో ఫాసిస్టుతత్వమును వృద్ధిజేసి సామ్యవాదులను

అణచివేసెను. ముస్సోలినీ ఇటలీకి నియంత అయి 1935 లో ఆఫ్రికాలోని అబ్బీనియా దేశముపైకి దాడివెడలి 1936 లో కబళించెను. ఇతనికి ఆశ యింకను తీరలేదు.

# 7. గత మహాసంగ్రామము సోవియట్టురష్యా

ఈ సంగ్రామసమయంలోనే సాంఘిక సామ్యవాద ప్రభుత్వము రష్యాలో ఏర్పడెను. ఇందున్న 63 భాషలను మాట్లాడేవారంతా ఏకమై యీ ప్రభుత్వాన్ని స్థాపించారు. 1917 సం॥రం మార్చినెలలో రష్యాచక్రవర్తి అయిన జారును తొలిగించిరి.

1917 నవంబరులో బోల్షివిక్కుపక్షమువారు రాజ్యమును ఆక్రమించి సాంఘిక సామ్యవాదప్రభుత్వమును ఏర్పాటు చేసిరి.

1918 మార్చిలో సోవియట్టురష్యాకున్ను జర్మనీ ప్రభుత్వమునకున్ను బ్రెస్టిలిటాస్కు అను ప్రదేశమున సంధి కుదిరెను. ఈసంధివల్లనే పూర్వపు బాల్టిక్ రాష్ట్రములున్ను ఇప్పటి 1. ఫిన్లాండు, 2. ఎస్టోనియా, 3. లాటివియా, 4. లిథూనియా,

5. పోలండు దేశములున్ను రుమేనియాలో కలిపిన బెస్సారాబియా అను ప్రదేశమున్ను సోవియట్టురష్యా తనవిగా నున్న వీటిని వదలుకొనెను.

1920 సం॥రంలో ఫిబ్రవరి అక్టోబరు నెలలలో పోలండు నకు సోవియట్టురష్యాకు యుద్ధం జరిగెను.

1921 మార్చినెలలో లెనిను మహాశయుడు నూతన ఆర్థికప్రణాళికను ప్రచురించెను.

1924 లో లెనిను చనిపోయెను.

1928 అక్టోబరునెలలో ప్రథమ అయిదు వత్సరాల ప్రణాళికను అమలులోనికి తెచ్చెను. సాముదాయిక వ్యవసాయపద్ధతిని అమలులో నుంచెను. యంత్రసామగ్రిని తయారు చేసెను.

1932 డిశంబరుతో యీ అయిదేండ్ల ప్రణాళిక పూర్తి అయ్యెను.

1933 లో మరల రెండో అయిదేండ్ల ప్రణాళికను ప్రచురించిరి.

1936 లోనే యీ రెండవ అయిదేండ్ల ప్రణాళిక పూర్తిఅయ్యెను. దీనిలో సాంఘిక ఐకమత్యం, పారిశ్రామిక వృద్ధి కలిగెను.

1937 లో మరల మూడవ అయిదేండ్ల ప్రణాళికను ప్రచురించిరి.

1937 ప్రజాప్రభుత్వ పరిపాలనతో కూడిన సాంఘిక సామ్యవాదప్రభుత్వ ప్రణాళికను అమలులోనికి తెచ్చిరి; ఆయుధసామగ్రిని హెచ్చించుచుండెను.

1934 శెప్టెంబరు 18 ని అంతర్జాతీయ సంఘంలో చేరెను. సోవియట్టు రష్యాకు సామ్రాజ్యతత్త్వము లేదు. స్వసంరక్షణకు యీ పై అయిదు వత్సరాల ప్రణాళికతో సోవియట్టు రష్యాలోని పనికిమాలిన భూప్రదేశ మంతటిని అక్కరకు వచ్చునట్లు జేసి భూతల స్వర్గ మనునట్లు చేయగలిగెను. ఈ సోవియట్టు తత్త్వము యూరపు దేశాలలోను, జపానుదేశములోను వ్యాపించిన అచ్చటి సామ్రాజ్యాధిపతులకున్ను సామ్రాజ్యకాంక్ష గలవారికిన్ని ప్రజాప్రభుత్వమను పేరిట ప్రభుత్వాధికారమును చేబట్టివున్న ధనికవర్గానికి వారి భోగలాలసలకు దురాశలకు ఆటంకములు కలుగునను కారణంతో సామ్యవాదమును అణచజూచుచున్నారు. సామ్యవాదమును అణచితే జర్మని, ఇటలీ దేశములోని ఫాసిజమువల్ల అమలులోనున్న సామ్రాజ్యాధిపతులకు వారివారి భాగాలలో ఎక్కడ ఏమి ఆటంకాలు కలుగునో అను భయం లేకపోలేదు. మొత్తానికి ధనికవర్గము చేతులలోనుండే ప్రజాప్రభుత్వములకు ఫాసిజమన్నా, సామ్యవాద మన్నా ఇష్టం లేదు గాని యీ రెంటిలో ఫాసిజమంటేనే లోలోన కొంత యిష్టంవుంది.

## 8. ప్రాపంచకరాజకీయములలో కలిగే మార్పులకు యీ 7 దేశాలే కారణం

ప్రాపంచక రాజకీయములలో కలిగే మార్పులకు 1. బ్రిటను, 2. అమెరికాసంయుక్తరాష్ట్రములు, 3. ఫ్రాన్సు, 4. జర్మనీ, 5. ఇటలీ, 6 సోవియట్టురష్యా, 7. జపాను దేశములే అయియున్నవి. వీటిల్లో అసంతుష్టిగా నున్నవి జపాను జర్మనీ, ఇటలీదేశాలే. సంతుష్టిగా నున్నవి బ్రిటను, ఫ్రాన్సు, అమెరికాసంయుక్తరాష్ట్రాలు, సోవియట్టురష్యా దేశాలు అయి యున్నవి.

---

## 9. గత మహాసంగ్రామ అనంతరం యూరపులో బయలుదేరిన రాజకీయనాయకులు.

1. లాయిడుజార్జి (బ్రిటను) (2) విల్సను (అమెరికా) (3) క్లైమెన్ శో (ఫ్రాన్సు) యీముగ్గురు వెర్సల్లీసుసంధిని తయారుచేసినవారే.

(4) వాయిన్ కేరు (ఫ్రాన్సు) జర్మనీని బాగా అణచాలనే కోరికను గలిగినవాడు (ఫ్రాన్సు అధ్యక్షుడు)

(5) ముస్సోలినీ (ఇటలీనియంత) ఫాసిస్టు నాయకుడు.

(6) పిల్సు డిస్కి (7) బెనేస్, వీరువురు పోలండుదేశమును ఉద్ధరించినవారు.

(8) స్ట్రెసెమాన్నా, జర్మనీని తిరిగి ఆర్థికంగా ఉద్ధరించుటకున్నూ అంతర్జాతీయసంఘంలో చేర్చుటకు యత్నించెను. ఈతడు 1929 ఫిబ్రివరిలో చనిపోయెను.

(9) బ్రెండు (ఫ్రాన్సు) యూరపులోని దేశాలన్ని ఐకమత్యంగా వుండాలనే కోరికగలవాడు.

ఈతడే 1928 ఆగష్టు 27 న కెల్లాగు పాక్టు అనునది ఏర్పాటుచేసెను. అనగా ఆయుధములను ఏయే దేశం ఎంతెంత వరకు తయారుచేసుకోవలెనో అనునిర్ణయమునకున్ను రాబోవు యుద్ధాలకు తావులేకుండా నుండే ఏర్పాట్లకు నొకప్రణాళికను ఏర్పాటుచేసెను. కాని యీ కెల్లాగుపాక్టును అంతర్జాతీయసంఘం ఆమోదించినా దానిఫలితాన్ని ఏ దేశంకూడా అనుసరించకుండా ఎవరిమట్టుకువారే స్వేచ్ఛగా ఆయుధసామగ్రిని హెచ్చించుకొంటున్నారు ఈతడు 7 మార్చి 1932 లో చనిపోయెను.

(10) కెల్లాగు. (అమెరికా) శాంతి స్థాపనకు పాటు బడినవాడు.

(11) హిట్లరు. నాజీపార్టీనాయకుడు (జర్మనీనియంత)

(12) స్టాలిన్. (సోవియట్టురష్యా పరిపాలకుడు. కమ్యూనిస్టుపార్టీకి కార్యదర్శి).

(13) రామ్సేమాక్డనాల్డు (బ్రిటను) ప్రధానమంత్రి పరిపాలనలో కలిగిన కలవరము. వీరినిగూర్చిన జీవితచరిత్రలు, వీరి రాజకీయచరిత్రలు తెలుసుకోవడం అవుసరం.

(14) డీవెలరా- (ఐర్లండుఅధ్యక్షుడు).

(15) అమెరికాసంయుక్త రాష్ట్రాలు ప్రెసిడెంటు. రూజువెల్టు.

---

# 10. తూర్పుదేశాలలోని జాతీయప్రబోధం.

జపాను, ఇండియా, సయాం, చైనా, ఇరాక్, (పరిష్యా) ఆఫ్గనిస్థాన్, ఈజిప్టు, టర్కీ, అరేబియన్ రాజ్యాలు మున్నగు వాటిల్లో జాతీయప్రబోధం హెచ్చి, ప్రజాప్రభుత్వపరిపాలనకు ఆందోళనలు సలుపుతున్నాయి ఇందులో జపాను, చైనాను ఆక్రమించుటకు చేసే యత్నాలు 1931 నుండి అపారంగా వున్నాయి.

ఈజిప్టుకు స్వాతంత్ర్యం ఇటలీ—అబ్సీనియా యుద్ధం వల్ల వచ్చింది. ఇండియా స్వాతంత్ర్యంకోసం 1935 ఇండియా ఆక్టును ఏలా వినియోగించాలో ఆలోచనలు చేస్తోంది.

---

## తూర్పు దేశాలలోని రాజకీయనాయకులు.

1. మహాత్మా గాంధి (ఇండియా) అసహాయోద్యమ తత్త్వమును అమలులోనికి తెచ్చెను.

2. సన్ఎట్ సేను (చైనా) చనిపోయెను.

3. చాంకెషేక్ (చైనా) మతవాదతత్త్వంతో కూడిన చైనాపరిపాలకుడు.

4. కెమల్ పాషా (టర్కీ).

5. జగుల్ పాషా (ఈజిప్టు).

వీరినిగూర్చిన జీవితచరిత్రలు రాజకీయ అంశములు తెలుసుకోవడం అగత్యము.

## 11. ఇపుడు అమలులో నున్నవి ప్రజా ప్రభుత్వములా? నియంతప్రభుత్వములా?

గత మహాసంగ్రామమునకు పూర్వపుస్థితి, గత మహాసంగ్రామమునకు పూర్వము అమలులో నున్న సంపూర్ణ నిరంకుశ ప్రభుత్వములు——

1. జపాను, టర్కీ, రష్యా ఆఫ్రికాలోని అబ్సీనియా దేశాలు.

2. సగం నిరంకుశ ప్రభుత్వంలో యీ దిగువ దేశాలుండెను—

జర్మని, ఆస్ట్రియా, హంగేరీ, స్పెయిను దేశాలు.

3. రాజుయొక్క పరిపాలనలో నుంటూ శాసనసభలతో పరిపాలింపబడే దేశాలు—

యునైటెడ్ కింగడం, స్కాండినేవియా, బెల్జియం, హాలండు దేశాలు.

4. సగం నియంతృత్వ పరిపాలనలో నుండేవి. దక్షిణ అమెరికాలోనున్న వివిధ రాజ్యాలు.

5. అధ్యక్షునితో కూడిన ప్రజాప్రభుత్వ పరిపాలనలో నున్న దేశము—అమెరికా సంయుక్త రాష్ట్రములు ఒక్కటే.

6. పార్లమెంటు పరిపాలనతో కూడిన ప్రజాప్రభుత్వము ఫ్రాన్సు ఒక్కటే.

—:గత మహాసంగ్రామం అనంతరం జరిగినమార్పులు:—

నిరంకుశ ప్రభుత్వాలలోను చాలావరకు ప్రజాప్రభుత్వ పరిపాలనలు ఏర్పడెను. ఈప్రభుత్వాలలో పెరిగిన జాతీయ తత్వమువల్లను హెచ్చుదేశాలలో సంపూర్ణ సగంనియంతృత్వ పరిపాలనలు అమలులోనికి వచ్చాయి.

—:సంపూర్ణ సగం నియంతృత్వ పరిపాలనలుగల దేశాలు:—

1. సోవియట్టురష్యా —1937 లో ప్రజాప్రభుత్వ పరిపాలనకు శాసనములు కావింపబడెను.

2. ఇటలీ—ప్రజాప్రభుత్వ పరిపాలనలో కలిగిన అనర్ధకాలవల్ల డిక్టేటరుపరిపాలన వచ్చెను.

3. జర్మనీ— డిటో

4. హంగేరి—జమీందార్లు, భూస్వాములు గలరు. ఈ వుభయుల కలయికవల్ల ఏర్పడెను.

5. పోలండు—ఆర్థిక రాజకీయాభివృద్ధికొరకేర్పడెను.

6. జుగోస్లోవియా—రాజుతోకూడిన నియంతృత్వం.

7. టర్కీ— ఆర్థిక రాజకీయ సాంఘికాభివృద్ధికొరకేర్పడెను.

8. స్పైను—ప్రజాప్రభుత్వ మేర్పడడం మరల జమీందార్లు, భూస్వాములు ఏకమై డిక్టేటర్లు ప్రభుత్వాన్ని స్థాపించడం జరుగుతోంది.

9. ఆస్ట్రియా—జర్మనీనే అనుకరిస్తోంది.

10. రుమేనియా—రాజుతోకూడిన శాసనసభానియంతృత్వము.

11. బల్గేరియా—రాజుతోకూడిన నియంతృత్వము.

12. లితూనియా—ప్రజాపరిపాలనతో కూడిన నియంతృత్వము.

13. గ్రీసు డిటో.

14. పోర్చుగల్—బ్రిటనుతో హెచ్చుసంబంధంకలదు. దానినే అనుకరించుచుండును.

15. అల్బేనియా—రాజుపరిపాలనలో నున్నది. ఇటలీ చెప్పుచేతలలో నుండెను.

16. ఈజిప్టు—ప్రజాప్రభుత్వము.

17. అబ్సీనియా—ఇదివరలో రాజు వుండెను. ఇపుడు ఇటలీనియంతక్రిందకు వచ్చెను.

18. చైనా—సగం డిక్టేటరుషిప్పు.

19. సయాం— ఇదివరలో నిరంకుశ పరిపాలనతో రాజుండెను. ఇపుడు రాజుతోకూడిన పార్లమెంటు ప్రభుత్వమేర్పడెను.

20. జపాను—రాజుతోకూడిన పార్లమెంటు ప్రభుత్వం శ్రీమంతులతో సంబంధంవుండే సైనిక, నావికాధిపతులకే ప్రభుత్వ పరిపాలనలో అధికారంవుంది. కొంచెం యించుమించుగా నియంతవలెనే పరిపాలిస్తు వుంటారు.

21. మధ్య, దక్షిణ అమెరికా దేశములలోని వివిధ దేశాలు ప్రజాప్రభుత్వ పరిపాలనలో నున్నను సైనికాధి

కారి యే అధ్యక్షుడుగ నుంటూ నియంతవలె పరిపాలించు చుండును.

22 ఫ్రాన్సు—ప్రజాప్రభుత్వ పరిపాలన.

| | |
|---|---|
| 23. బెల్జియం<br>24 హాలండు<br>25. డెన్మార్కు<br>26. ఐసులాండు<br>27 నార్వే<br>28. స్వీడన్ | రాజుతో కూడిన పార్లమెంటు ప్రభుత్వాలు. |
| 29. స్విజర్లండు<br>30. జెకోస్లావిక్యా<br>31. ఫిన్లాండు<br>32. ఎస్టోనియా<br>33. లాటివియా | కాగితంమీద ప్రజాప్రభుత్వ పరిపాలనతో నున్నా అమలులో మాత్రం సోవియట్టు రష్యా యొక్క కమ్యూనిజమునకు జర్మనీయొక్క నాజీ తత్వమునకు భయపడి నియంతల పరిపాలన లోనే యీ దేశాలు పరిపాలింపబడుతున్నాయి. |
| 34. బ్రిటను | రాజుతో కూడిన పార్లమెంటరీపరిపాలన వీరిక్రిందనున్న దేశాలకు ఎపుడో ప్రజాప్రభుత్వ పరిపాలన యిస్తామంటూ వీరే నిరంకుశంగా ఆయా దేశాల ప్రజలను పరిపాలిస్తున్నారు. |

వీరి క్రిందనున్న దేశాలలో కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలండు. దక్షిణాఫ్రికాలకు హెచ్చుస్వాతంత్ర్యం వుంది. ఐర్లండునకు డీవెలరా అధికారంలోనికి రాగానే ఇంగ్లండుతో నుండే సంబంధం కాస్తా విడగొట్టి పారవేసెను.

35. అమెరికాసంయుక్తరాష్ట్రాలు — అధ్యక్షునితో కూడిన ప్రజా ప్రభుత్వపరిపాలన 1933 నుండి హూజువెల్టు అధ్య క్షుడుగా వచ్చి కొంచెం యించుమించుగా నియంతవలెనే ప్రవ ర్తించి ఆర్థికంగా క్రుంగిపోతున్న అమెరికాను లేవదీయగలిగెను.

ఈసందర్భాలన్నీ జూస్తూవుంటే ప్రజాప్రభుత్వమని చెప్పుకునే పరిపాలనలోనున్న దేశాలున్నూ అసలు నియంతృత్వ పరిపాలనలోనున్న దేశాలున్నూ కొంచెం యించుమించుగా నియంతృత్వ పరిపాలనతోనే ప్రస్తుతంలో ఆయాంప్రభుత్వాలను సాగిస్తున్నాయని చెప్పాలి. దీనినిబట్టి గత మహాసంగ్రామ అనంతరం సరియైన కట్టుదిట్టాలతో కూడిన నిజమైన ప్రజాప్ర భుత్వపరిపాలన అమలులోనికి అన్ని దేశాలలోను రాలేదు. ఇందులకు కారణం బలంగల దేశాలకు భయపడిన చిన్న దేశాలు డిక్టేటరుషిప్పును వహిస్తున్నాయి. బలంగల దేశాలలోని శ్రీమం తులకు ఆయా దేశాలలో కమ్యూనిజం వ్యాపించి ఎక్కడ ముప్పు వాటిల్లునో అనుకారణంతో శ్రీమంతులే అధికారంలో నుంటూ నియంతలవలె పరిపాలింపబడుతున్నారు

నియంతపరిపాలనలో శ్రీమంతులు, మధ్యతరగతివారు, కార్మికకర్షక తరగతి అను యీముగ్గురిలో ఎవరు నియంతగా వుండవలెననునదే యిప్పుడు చర్చనీయాంశముగ నున్నది. ఇటలీ, జర్మనీదేశాలలో మధ్యతరగతి నియంతృత్వము, సోవియట్టు రష్యాలో కార్మిక కర్షక నియంతృత్వము, మిగతాదేశాలలో ప్రజా ప్రభుత్వములతో నున్న రాజుతోకూడిన ప్రజాప్రభుత్వ పరిపాలనతోనున్న. అట్టిదేశాలలోని పరిపాలన శ్రీమంతుల చేతులలోనే వుంది. అందువల్లనే యీదేశాలకు ఫాసిజమన్నా కమ్యూనిజమన్నా భయమే. కాని యీరెంటిలో ఫాసిజమునకే శ్రీమంతులు తలవగ్గుతున్నారు. రాబోవుయుద్ధానంతరం ఇవి ఏలా మారునో గదా!

---

# 12. మానవుడు, పశువు, నూనె, విద్యుచ్ఛక్తి – వీటి బలాబలములు

| | | |
|---|---|---|
| మనిషి బలము | 1/8 | హార్సుపవర్సు |
| గుర్రము ,, | 1 | ,, |
| మోటారు ,, | 20 | ,, |
| గాలివిమానము ,, | 100 | ,, |
| డిజిల్ ఇంజను ,, | 10000 | ,, |
| విద్యుచ్ఛక్తి ,, | 100000 | ,, |

పై రీతిగనుండే బలములు ప్రస్తుతము నవనాగరికత అనుకొనే దేశాలలో అమలులో నుంటున్నవి. గత మహాసంగ్రామములో ఇంజనులు మోటారులతో యుద్ధాలు జరిగెను. ఇపుడు విద్యుచ్ఛక్తి, గాలివిమానములవల్ల యుద్ధాలను సాగిస్తున్నారు.

1930—31లో భారతదేశంలో జరిగిన ఉప్పు సత్యాగ్రహపురోజులలో పెషావరు ప్రాంతమున గాలివిమానములపై నుండి బాంబుల వర్షమును కురిపించినసంగతియు, 1936లో ఇటలీ-అబ్బీనియా దేశాలకు జరిగినయుద్ధంలో గాలివిమానములనుండి బాంబులను, విషవాయువులను, ఇటలీవారు వదలిన విషయమున్ను, ప్రస్తుతంలో స్పెయినుదేశంలో బాంబులను గాలివిమానములనుండి వదలుతున్న విషయమును గమనించినచో రాబోవు యుద్ధాలు ఎంత భీకరంగా జరుగునో ఊహించవలెను,

— —

# 13. 1913—1936 రాబోవు యుద్ధానికి గల కారణాలు.

— సంధిపత్రాలన్నీ వట్టివైపోవడం —

1. వెర్సైల్సుసంధిలో ఏర్పడిన

(1) యుద్ధఋణములు తీర్చడం

(2) సైనికాభివృద్ధిని తగ్గించడం

(3) సరిహద్దు తగవులు

యీ పిటాడున్ను యీ సంధిషరతులప్రకారం జరగ లేదు. యిందువల్ల యీ సంధి అమలులోనికి రాలేదు.

2. లొకార్నో సంధి

ఈ సంధిని జర్మనీ వప్పుకోలేదు.

3. అంతర్జాతీయ సంఘం.

ఈ సంఘం మంచూరియా, అబ్బీనియా, స్పైను, పాలె స్తైను, దేశాల ప్రభుత్వాలను అచ్చటి ప్రజల కోరికలను సంర క్షించుటలో అడ్డుపడలేదు. యిందువల్ల యీసంఘం నిర్వీర్య మైనదిగా అయిపోయెను.

4. వాషింగ్టన్ సంధి.

ఈసంధిని జపాను తుడిచిపెట్టెను.

5. కెల్లాగుపాక్టు

ఈపాక్టును ఇటలీ తుడిచిపెట్టెను.

—:యుద్ధానికి దారితీయడం :—

(1) వలసరాజ్యాలకు ప్రాకులాట

(2) సైనికబలమును చేకూర్చుట ఆర్థికాభివృద్ధికే అనడం.

(3) ఒక దేశానికి మరోదేశానికి లోలోన అంతః శీతాలు పెరుగుచుండడం.

(4) యుద్ధమునకుగాను ప్రజలను సాంఘికంగాను, రాజకీయంగాను తయారుచేసే ప్రచారమును చేయుచుండుట- ఫాసిస్టు తత్త్వమును వృద్ధిచేయుచుండుట- అనగా సామ్రాజ్యాకాంక్షను పెరగనిచ్చుట-

—: బ్రిటిషువారి విదేశాంగ రాజకీయకార్యాలయపుశాఖ :—

1913 లో ఇందు 183 గ్గురు పనిచేస్తుంటే 1932 నాటికి 766 గురున్నారు. ఈపెరుగుటకుగలకారణం యుద్ధభయమే.

—:యుద్ధములలోని ఘోరమరణాలు:—

వెనుకటి ఫ్రెంచివిప్లవంలో దామాయిషాను రోజుకు ముగ్గురు చొ॥

1912 లోని ట్రిపోలియుద్ధంలో రోజుకు ముప్పది మంది చొ॥

ఇప్పటి గాలివిమానాల యుద్ధాలలో క్షణానికి ఎంత మంది చస్తారో యోచించండి-

12 అక్టోబరు 1935 "డైలీ వర్కరు" అను దినపత్రిక లండనునుండి వెలువడేదానిలో ఇటలీవారు అబీసీనియా దేశముపై చేసిన యుద్ధములో సగటున రోజుకు 400 బాంబు

లను వేసినటులను, దానివల్ల కొందరు చావడం, బ్రతికనవారికి కళ్ళు, కాళ్ళు, ఊపిరితిత్తులు చెడిపోయి వేనకువేలు అంగ వైకల్యాలతోను రోగాలతోను బాధపడుచున్నటుల వ్రాసెను

——

# 14. రాబోవు యుద్ధములు ఆయుధ సామగ్రి

1936 సం॥ రం నుండియు ఆయుధసామగ్రి యొక్క పెంపులో ఏ దేశానికి ఆ దేశమే పోటాపోటీలతో ఆయుధ సామగ్రిని హెచ్చించుకొంటున్నాయి. 1929 సం॥రంలో కలిగిన ఆర్థిక విప్లవమే యిందుకు కారణం- అప్పటినుండియు ఆర్థిక సరఫరాకుగాను ఒక దేశంమీద మరొక దేశము పడుటకు యత్నాలు చేస్తున్నాయి. 1931 సం॥రం లో జపాను దేశము చైనామీదకు దాడి వెడలడం మొదలెట్టింది. ఇంతవరకు ఆ దాడికి అంతు లేకుండా వుంటోంది. జపానుదాడివల్ల సోవియట్టురష్యాకు ఏమి భంగం కలుగునో అను భయంతో ఆయుధసామగ్రిని హెచ్చించుకొంటోంది. 1932 లో జరిగిన ఆయుధ విసర్జన సభవల్ల ఏమీ ఉపయోగం కలుగలేదు.

అమెరికా సంయుక్తరాష్ట్రాలు నావికాదళాన్ని పెంచుతున్నాయి. 1935 నుండి జర్మనీలో హిట్లరు ఆయుధసామగ్రిని

పెంచుతుండెను. 1935 సం॥రంలో ఇటలీనియంత ముస్సోలినీ, దక్షిణాఫ్రికాలో స్వాతంత్ర్యదేశంగా గున్న అబిసీనియా మీదకు దాడివెడలి 1936 లో దానిని జయించెను.

దీనినిబట్టి ఇటలీ, జర్మనీ, జపాను దేశాలు యుద్ధధోరణిలోనే వున్నాయి. వీటిని హంగేరీ అనుసరిస్తోంది. ఫ్రాన్సు దేశము జర్మనీనిబట్టి ఆయుధసామగ్రిని పెంచుతోంది. జర్మనీని అణచివుంచుటకు ఫ్రాన్సు దేశము సోవియట్టురష్యాతో 1935 లో ఒడంబడిక చేసుకొంది. 1935-36 మధ్య బ్రిటను కూడ యీ పోటాపోటీలోనికి దిగి ఆయుధసామగ్రిని పెంచుతోంది.

ఈ దిగువ అంశములనుబట్టి రాబోవు యుద్ధమునకు దారి ఏర్పడుతోందని స్పష్టపడగలదు.

| | జరిగిన పని. | కలిగిన ఫలితము. |
|---|---|---|
| సెప్టెంబరు 1931 | జపాను దేశము మంచూరియా మీదకు దాడివెడలెను. | చైనా సంరక్షణకు 9 అధికారములతో తయారైన ఒడంబడిక (చైను పవర్ పాక్టు) అంతరించెను. సైబేరియాసరిహద్దున సోవియట్టు రష్యా తగిన కట్టుదిట్టాలు చేస్తోంది. ఎయిరువిమానా |

| | | |
|---|---|---|
| | | నములను యిందు హెచ్చుగా నిలువచేస్తోంది. 1932 సం॥రములో జపానుసైన్యమునుపెంచింది. |
| 1933 | మంచూరియా దేశము సోవియట్టు రష్యా దేశపు సరిహద్దులలో కలహాములు జరిగెను | |
| 1935-36 | మంగోలియా దేశములోని అధికారంలో జోక్యము. | 1935సం. వాషింగుటన్‌నందు జరిగిన సంధిపత్రాన్ని బట్టి అమెరికా సంయుక్తరాష్ట్రాలు నావికాదళాన్ని పెంచుట, 1935 నావికాదళ సంధిని జపాను త్రోసివేయుట, 1936 లండనులో జరిగిన నావికాదళ సభ పూర్తి కాకపోవుట. |
| 1933. | ఆయుధ విసర్జన సభనుంచి జర్మనీ లేచిపోవుట. | జర్మనీ ఆయుధసామగ్రిని పెంచుతోంది. |

| | | |
|---|---|---|
| 1934. | జర్మనీ ఆయుధ విసర్జన విషయంలో చేసిన ప్రకటనను ఫ్రాన్సు ఒప్పుకోక పోవుట. | జర్మనీలో 1935 మార్చి 16వ తేదీని వెర్సైల్సుసంధిని హిట్లరు నియంత ఒప్పుకొనలేదని త్రోసి వేయుట, సైనిక, నావికా బలమును పెంచుట. |
| | | 1935 డిశంబరు 26 న ఫ్రాన్సు దేశముయొక్క సైనిక శాసనములో 20 వత్సరాలు గల యువకులంతా సైనికులుగా జేరవచ్చునను నియమంతో అదివరకుండే హెచ్చువయస్సు నిర్ణయమును తగ్గించిరి. |
| 1936 | మార్చి 7 వ తేదీని జర్మనీ దేశము లోకార్నో సంధిని త్రోసివేసి రైనులాండును ఆక్రమించుట. | |

| | | |
|---|---|---|
| 1936 | ఏప్రియలు నెలలో ఫ్రాన్సు సోవియట్టు దేశాలకు కుదిరిన సంధి ఆమోదింపబడెను. | 1936 అగస్టు 11వ సోవియట్టు రష్యా దేశములోని సైనిక శాసనములో 20 వత్సరాల వయస్సు గలవారు 1939 నుండి సైనికులుగ చేరవచ్చునని సవరణ చేసింది. |
| | | 1936 అగస్టు 21వ జర్మనీలో పనిచేయు సైనికులు పించను తీసుకొను కాలము, అంతకున్న కాలనిర్ణయమునకును రెండేండ్లు హెచ్చించిరి. 1936లో ఫ్రాన్సు 186000000 పౌ॥ల సొమ్మును ఆయుధ సామాగ్రిని 4 ఏండ్లలో వృద్ధి చేయుటకు ప్రత్యేకించెను. పౌను అనగా రమారమి రు 14 లు. |

1913—36

ఆయుధసామగ్రిని పెంచుటకు 1913—36 సం॥రాల మధ్య యీ దిగువ దేశముల ఆదాయ వ్యయపట్టికలో ఏలా ఎంతెంత సొమ్మును ప్రత్యేకించినదియు తెలియగలను.

| దేశం | సం॥రం॥ | వ్యయం యొక్క మొత్తము సంఖ్య బంగారపు పౌండ్లు | వ్యయం యొక్క మొత్తము సంఖ్యలో ఆయుధ సామగ్రికి ప్రత్యేకించిన సొమ్ము | మొత్తం వ్యయములో ఆయుధ సామగ్రికి నూటికి కేస్తున్న ఖర్చు |
|---|---|---|---|---|
| యునైటెడ్ కింగడం | 1913 | 966000000 | 376000000 | 39 |
| (ఇంగ్లండు | 1934 | 2361000000 | 336000000 | 14 |
| స్కాట్లండు | 1935 | 2483000000 | 401000000 | 16½ |
| అండ్ వేల్సు) | 1936 | 2637000000 | 571000000 | 21½ |
| అమెరికా సంయుక్త రాష్ట్రాలు | 1913 | 728000000 | 244000000 | 33½ |
| | 1934 | 4174000000 | 490000000 | 11½ |
| | 1935 | 4542000000 | 537000000 | 11½ |
| | 1936 | 3983000000 | 708000000 | 18½ |
| ఫ్రాన్సు | 1913 | 633000000 | 295000000 | 46 |
| | 1934 | 1966000000 | 438000000 | 22 |
| | 1935 | 1864000000 | 416000000 | 22 |
| జర్మనీ | 1913 | 857000000 | 445000000 | 52 |
| | 1934 | 1956000000 | 233000000 | 12 |
| | 1935 | ప్రచురించలేదు. | 2100000000 | |

1935 అంకె పిట్సన్ చర్చలు బ్రిటిషు పార్లమెంటులో 1936 లో మాట్లాడడము యీ అంకెలు ఇతరత్ర వాకబువల్ల తేల్చితినని చెప్పెను.

1935 లో 3500000000 డాలర్లను వ్యయపు మొత్తముగా నున్నటులను నూటికి 60 వ వంతు ఆయుధసామగ్రికి ఖర్చుచేసినటుల యితరత్రా తేల్చిరి.

| | | | | |
|---|---|---|---|---|
| జపాను | 1913 | 226000000 | 102000000 | 35 |
| | 1934 | 382000000 | 16[illegible]000000 | 43½ |
| | 1935 | 3[illegible]2000000 | 180000000 | 46 |
| | 1936 | 409000000 | 187000000 | 45½ |
| ఇటలీ | 1913 | 5[illegible]1000000 | 1[illegible]7000000 | 29 |
| | 1934 | 1157000000 | 225000000 | 12½ |
| | 1936 | 1203000000 | 235000000 | 19 |

1936 లో అబ్సీనియా యుద్ధానికి 100000000 డాలర్లు ఖర్చు అయినటుల తేల్చిరి.

| | | | | |
|---|---|---|---|---|
| సోవియట్టు రష్యా | 1913 | 1746000000 | 476000000 | 27½ |
| | 1934 | 5719000000 | 225000000 | 4 |
| | 1935 | 7681000000 | 904000000 | 12 |
| | 1936 | 9396000000 | 1731000000 | 18½ |

ఆయుధసామగ్రిని పెంచడం అంటే స్వసంరక్షణకు

అనే సాకు చెప్పలేదు గాని, అది నమ్మదగినది కాదు. ఎప్పటికైనా యింతా తగలేయడానికే కాబట్టి యుద్ధం రాక తప్పదు. ఈ అంకెల వివరాలు "పీపిల్స్ ఇయర్" బుక్కు నుండి తీసుకోబడెను.

ఈ స్థితిలో యుద్ధమా? శాంతియా? అను దానిలో ఏది కలుగుతుందో చదువరులే గ్రహించుకోండి.



# యుద్ధమా? శాంతా?

## 1. సామ్రాజ్య వ్యవస్థలు.

తిమి, తిమింగిల, తిమింగిలగిల న్యాయముగా ప్రపంచమున సామ్రాజ్యములు సర్వకాలములందును విలసిల్లినవి. విలసిల్లుచున్నవి. 19వ శతాబ్ది మధ్యభాగమునందే దుఖండములందును బ్రిటన్, ఫ్రాంసు, రష్యా, అమెరికా, జర్మనీ, బెల్జియం దేశములు విజృంభించి పోటీచేసి ఏలయినతావునందెల్ల సామ్రాజ్యములు నిర్మించెను. 20 శతాబ్దములో జపాన్ ఇటలీ దేశములు వీరి యడుగుజాడలలోనే నడుచుచున్నవి. ఆఫ్రికా, ఆసియా, ఆస్ట్రేలియా ఖండములు పూర్ణముగా నిర్వీర్యములై విదేశీయుల ఆధిపత్యమునందున్నవి. సామదాన భేద దండోపాయ ప్రయోగమందు గడిదేరి తోటి దేశములకన్న ఫ్రాంసు బ్రిటను దేశములు తాము జీర్ణించుకోలేనంత భూఖండములను కబళించి వైచెను.

1. కొందరు వర్తక సంఘముగా నేర్పడి సర్వసమృద్ధమై సుభిక్షమైన దేశమును జూచుకొందురు.

2. ఆ దేశమందలి [illegible]

దించి వర్తకముతోడనే కాలక్షేపమొనర్చుచు ప్రజానానుభూతి నార్జించి తలలో నాలుకగా మెలగుచుందురు.

3. పదపడి కొంతకాలమునకు "కార్యస్థానగషణా" అను సంకేతముతో తమవారి నాయకత్వమున దార్భాగ్యులగు కొందఱు దేశీయులను జేరదీసి పటాలములు నిర్మింతురు.

4 రాజు బలహీనుడగుటను గాంచి పక్షమవలంబించి ధనసహాయ మొనర్చి ప్రతివాదియగు బలవంతుని నణచుచూ దుకు బలహీనునివల్ల వివిధములగు హిరణ్యాక్షపరములు బడయుచుందురు. తమస్థానము బలపడినవెంటనే బలహీనుని గూడ హతమార్చి ఆరాజ్యమును తమ హస్తగత మొనర్చుకొందరు

5. తమ మతబోధకులను రప్పించి ప్రజలలో మత వ్యాప్తికై పాటుపడెదరు.

6. దేశీయములగు పరిశ్రమలను, కళలను నాశనముచేసి నూత్నములగు తమవానిని క్రమముగా వ్యాప్తింతురు. అధికారముతో దేశమును దోచనారంభింతురు.

7. విద్యావిధాన ఆరోగ్యములయందు శ్రద్ధ వహించరు. తమవారిపట్ల పక్షపాతబుద్ధితో మెలంగుచుందురు.

8. దేశీయులను నిర్వీర్యులజేసి తమయందే గౌరవభక్తులు గలవారిగా దిద్ది తీర్తురు.

9. నిర్ధనులై, నిస్పృహాయులై, నిస్తేజులైన రంగుజాతుల నుద్ధరించుటకు, వారిని తీర్చి దిద్దుటకు, వారికి నాగరికతపాఠము నేర్పుటకు, శ్వేతవర్ణీయులకు బాధ్యత తమకేదో గలదని శ్వేతజాతులు తమకు దామయి లోకమున జాటించుకొనుచుందురు.

ప్రస్తుతసామ్రాజ్యములు పెట్టుబడిదార్లు, గనులయజమానులు, పత్రికసంస్థల భూమంతులు, భూస్వాములు, యంత్రాగారాధిపతులు అను నీఅయిదువర్గములపైనను ఆధారపడియున్నవి. ఈవర్గీయులే స్వదేశవిదేశీయులను ఆయా సంబంధిపరిభుత్వములను తమ నష్టాచేతలలో నుంచుకొని ప్రపంచమును కొల్లగొట్టుచు తమపొట్టలు నింపుకొను చున్నారు. సామ్రాజ్యములు వలసరాజ్యములనియు, పలుకుబడిప్రదేశము లనియు, (spheres of influence) రక్షిత స్థానములనియు, (protectarates) ఒకనియూజ్ఞ ప్రకారము కొంతకాలము వరకు నేలవలసిన దేశములు, (మాండేట్లు) అనియు నానానామముల వ్యవహారింప బడుచున్నవి. స్వాతంత్ర్యపరిషత్తులు పలుదేశములుగానున్న కుతెగలు పినసమ్మిలించే మూలంగు చున్నవి. తమధనకాంక్షలసంతృప్తులై అగిన్యాయులై సకాలదయు దురాశాపరులయి పీను వెనుకబడియున్న దేశములను, బలహీనరాజ్యములను వెదకివెదకి ఎట్లో ఆయాదేశములను లోబరచుకొని

దేశవాసులను నిర్భాగ్యుల గావించుచు ధనమానప్రాణముల హరించుచు పీల్చిపిప్పిచేయుచున్నారు. వీరిలో వీరికి పోటీవచ్చినప్పుడే జగన్మారణకరములయిన మహాయుద్ధములు సిద్ధించుచున్నవి. వాయువార్తలు, రేడియోలు, ప్రధానపత్రికలు, సినీమాలు టెలిఫోనులు మొదలగు ప్రచారసాధనములన్నియు ధనవంతులచేతులయందే గలవు. వానిని తమయిచ్చవచ్చిన రీతిని వినియోగించుకొనుచు ఎన్నికలలో తమ సూత్రముల మోడ వీనిద్వారా ప్రచారము సాగించి తప్పించుచు వారి విజయమునకు సహకారులయి ప్రభుత్వములనే స్థాపించుచున్నారు. ప్రతినిధిప్రభుత్వములు, ప్రజాప్రభుత్వములు, నియంతృత్వ ప్రభుత్వములు, జాతీయప్రభుత్వములు లోనగునవి పేరునకే గాని నిక్కముగా ధనవంతుల శ్రీయస్సునే కోరుచున్నవి. పెట్టుబళ్ళకు సామ్రాజ్యములకు అవినాభావము. ఒకదానినుండి మఱొకటి యాధారపడి యుండును. స్వదేశములకు ఉత్పత్తి సామ్రాజ్యములందు విడుదల, సామ్రాజ్యములలోని ముడిపదార్థములు రప్పించుకొనుట, స్వదేశమందు రకరకములయిన పరిశ్రమలు నెలకొల్పి సాగించుట, ధనమును దేశమునందును విదేశములందును పెట్టుబడిపెట్టుట, లాభములు గడించుట, ఇటే ప్రపం

# ఫాసిజం.

సామ్రాజ్యతత్వమునకు నీ ఫాసిజమునకు మేనమామ పోలిక గలదు. ఇటలీ దేశమందు జన్మించెను. జర్మనీ రాజ్య మాక్రమించెను. బ్రిటనులో ప్రస్తుతము కాలూనుచున్నది. జపానులో జీర్ణించినది. స్పెయిను దేశమును నాశము గావించుచున్నది. మన దేశమునందుగూడ మచ్చునకు చప్పుచప్పుట గలదు. ధనవద్వర్గములతో మధ్యమతరగతి బుద్ధిమంతు లేకీభవించి కార్మికకర్షకుల నణగద్రొక్కజూచునప్పుడు ఈ తత్త్వముయొక్క నిజస్వరూపము బయల్పడును. "ఫాసిస్ మో" ఫాసెస్ విక్టర్సు (సుశిక్షణ) దీని కత్యావసర మంట. యువకులే ఇందు చేరవలసినవారు. విద్యాప్రయోజనము నిరుపయోగము. శాంతిప్రసంగము అశ్రావ్యము. కేవల బాహుబలసంపత్తి, ఆయుధసమీకరణము, మారణము, సంహారణము, అన్యరాజ్యాపహరణము ఇవిప్రధాన కర్తవ్యములు. నియంతల ఆజ్ఞను జవదాటరాదు. ఆకలితో బాధపడుచున్నను ప్రజాసమూహములు తాము సుఖము కలిగొన్నట్లు చెప్పుకోగూడదు. యుద్ధరంగమున దూకమన్న దూకవలయు. 1920లో బెనిటోముసోలినీ నాయకత్వమున నీతత్త్వము ఇటలీ దేశమందు పాదుకొనెను. పార్లమెంటరీ ప్రభుత్వములపై (ప్రజాప్రతినిధి ప్రభుత్వములు) వానికి మిక్కుటమైన అసూయ గలదు. తాను స్వయముగా సామ్యవాది యయ్యు కాలమునుబట్టియు, తన పార్టీ వారి అంతఃకలహములబట్టియు నీతత్త్వమును అమలులోకి తెచ్చెను. 1915లో

"పాపోడ్ ఇటాలియా" అను పత్రికను నిర్వహించుచు, ఇటలీని ఫ్రెంచివారిపక్షమున జేరుమని బోధింపసాగెను. ఈ సాయము నకు ఫ్రెంచిప్రభుత్వము 400 పౌనుల నియమముగా బహుమానించె నట. ఫాసిస్టులు నల్లచొక్కాలు ధరింతురు. ఈ "డ్యూస్" (నాయకుడు)తో ఇటలీరాజు రాజీనామా పడెను. అధికార మంతయు ఒకే వ్యక్తి కుండవలయును. దానిలో పాలువంచుకుండ వనునదే వీని ముఖ్యాశయము. 1922 అక్టోబరులో విజయుడై రోమునగర మాక్రమించెను. "ఫాసిస్టు గ్రాండు కౌన్సిలు"ను స్థాపించెను. యువకులలో నుద్రేకము ప్రేరేపించి వారికై వేలు వేలు సంస్థ లేర్పాటుచేసెను. 7-14 సం॥ రముల యీడుగల కుర్ర వాండ్రు "బెలిల్లా" సంస్థలలోను 14-18 సం॥రముల యీడు గలవారు "అవంగార్డిష్టీ" అను సంస్థలలోను చేరి శిక్షణ పొందుచున్నారు. వారు తీర్ణు లయినవెంటనే ఒక "బ్యాడ్జి" ఒక "రైఫిల్" ప్రతిబాలునికి బహుమానింతు రట. ఇప్పటి కీదేశమందు 90 లక్షల సభ్యులు ఫాసిస్టు సంఘములలో చేరి యున్నారు. ఫాసిస్టు సంఘములు జనసామాన్యములో విజ్ఞానాభి వృద్ధి కంతరాయము గల్పించుచు వారి మనఃప్రవృత్తులను యుద్ధములవంకకే మరలించు చున్నవి. పూర్వపు రోమకసా మ్రాజ్యౌన్నత్యమును వేమారు ముసోలినీ తన ప్రజల కుపన్య సించుచున్నాడు. యోధులు గండని ఉద్బోధించు చున్నాడు. స్త్రీలను వీరమాతలు గండని నచ్చజెప్పు చున్నాడు. యువకు

లను బాలురను తనసంఘములందు చేర్చుకొని తియ్యని పల్కుల తో కొదమసింగములవలెను రణభూములందు గంతికి వైరివీరులను చించి చెండాడుడని ప్రోత్సహించుచున్నాడు. నిరుద్యోగ సమస్యా పరిష్కారమునకై, విరివిగా ఆయుధ పరిశ్రమలు నెలకొల్పి యుద్ధోపకరణములు తయారుచేసి కయ్యమునకు కాలు దువ్వుచున్నాడు. తక్కువ ఆదాయముతో త్యాగము సల్పుమని ప్రజలకు చాటి చెప్పుచున్నాడు. అబిసీనియాదేశ మును కబళించి, స్పెయిన్ ప్రజారాజ్యమును హోమము చేయు చున్నాడు. తన ప్రభుత్వాదేశము స్పష్టము గా లేకున్న మానె, అబిసీనియా దేశము దానికి దక్కిపోవలయును. తన ఫాసిస్టు తత్వము విజయము గాంచవలయు. అది వాని యాశయము. ఫాసిస్టులకు "ఓటమి" అను పదము చెవిని బడగూడదట. తాము, తమ సహాధ్యాయులు, యువకులవలె నటించుచు, ఫాసిస్టు నాయకులు యువకబృందములనే తఱుచు యుద్ధరంగములకు త్రోయించి ఆహుతి చేయుచున్నారు. 70సం॥ల బాలుడగు రో॥ర్ పుకారుప్రెషన్న ఫాసిస్టుసంఘ ములు యువకసంఘములే యని యుద్ఘోషించుచున్నాడు. నాజీమత ప్రచారము గల జర్మనీదేశమందు కార్మికశాస నము (1934) 25ఏండ్లకు లోపుగల యువతీయువకులను పరి శ్రమలనుండియు, కర్మాగారములనుండియు, దుకాణముల నుండియు తొలగించివైచెను. యువకులను నిండ్లయందునను తక్కువ

కూలియిచ్చు వ్యవసాయదార్లవద్దను పనిచేయునట్లు నిర్బంధించెను. యువకులు ప్రభుత్వసేనలలో చేరునట్లు తీర్మానించెను. హిట్లరుని యంత (మన కేసున్) అనుగ్రంథములో బాలురకు మానసిక వికాసము ఉపరిష్ఠాపింపబడినను ఖండితముగా వ్రాసినైచినాడు. కేవల 'దేశభక్తి' స్వస్తిక పతాకము నారాధింపుడని శాసించుచున్నాడు. 'జర్మనీ దేశభక్త సోషలిస్టు (నాజీలు)' తొలిరోజులలో తాము అధికారము వహించినప్పుడు జనసామాన్యమునకు 25 వాగ్దానములు చేసి లరచేత నైకుంఠము చూపించిరి. వానిలో బ్యాంకుల ప్రాభవమును తగ్గించుచు, పెట్టుబడితత్వమును రూపుమాపి, వడ్డీలు లేకుండ చేయుట ముఖ్యాంశమై యుండెను. ప్రస్తుతము అనుగ్రంథమునకు వ్యతిరేకమే జరుగుచున్నది. ధనాఢ్యుడింకను ధనాఢ్యుడగుచున్నాడు. పేదవాడు మరింత నిరుపేద యగుచున్నాడు. కోటీశ్వరులు, బ్యాంకర్లు, యథావిధముగా చెక్కు-చెదరకుండ నున్నారు. ఏపదిమంది ధనాఢ్యుల చేతులలోనో ప్రస్తుతప్రభుత్వము నడుచుచున్నది. బ్యాంకర్ల ప్రతినిధి హేర్ సాచట్ యను నాయనే నిజముగా జర్మనీరాజ్యమును పాలించుచున్నాడు. ప్రధానార్థిక సంఘములలో (Supreme economic council) ప్రస్తుతము వార్ చోహెలెన్, సీమెన్సు, ప్రొఫెసర్ బోచ్, డాక్టరు పోగ్లర్, స్క్రోయిడర్ అను కుబేరులే చేరియున్నారు. రెండు వేల లక్షల పౌనుల మూలధనము ఈ పదిమంది చేతుల

యందును మూసలుచున్నవి. వీరిలో ముగ్గురకు 265 లక్షల పౌనుల స్వంతఆస్తిమే గలదు. కార్మికులకు సరియైన రాబడి లేదు.

1934 ఏప్రిల్ 13 తేది ఉపన్యాసమందు ప్రచారక మంత్రి గోబెల్సుగారు కార్మికులకు ముట్టుచున్న కూలి వారి జీవితావసరములకు సరిపోవుచుండుట లేదని ఒప్పుకొని యున్నారు. 1935 ఆగష్టులో సాదట్ గారు కూలి యింకను తగ్గించమని సలహా యిచ్చినాడు. తక్కువకూలి కంగీకరించు కార్మికుడే దేశభక్తుడని గోరింగుగారు చిలుకపలుకులు పలుకుచున్నారు. కార్మిక చట్టముల ప్రకారము యంత్రాగారాధిపతి నాయకుడు. కూలీలు (కార్మికులు) వానిమాట కెదురాడ రాదు. అతడిచ్చు భృతి కంగీకరింపవలయు. పెట్టిన మితిప్రకారమన్ని గంటలు పనిచేయవలయు. ఇందు కెదురుతిరుగుచో కార్మికునకు కారాగారప్రాప్తి సిద్ధించి తీరును. పేదవాండ్రు గృహావసతులు గావలయునన్న లదిగో "బారకాసులు" సైన్యములందు చేరి అందు నివసింపుడు అని నాజీలు ప్రజలకు చెప్పుచున్నారు. వారమునకు మాంసములేని భోజనములు రెండైనను లేక పోలేదు. యుద్ధోపకరణములు, ఆ యజమానుల లాభములు ఆయా కంపెనీలయొక్కయు బ్యాంకులయొక్కయు వాటాల ధరలు నానాటికీ పెరిగిపోవుచున్నవి. జనసామాన్యములో మాత్రము దారిద్ర్య మెచ్చగుచున్నది. 1935 సంవత్సరములో

జర్మనీప్రభుత్వము 8 వేల లక్షల పౌనులు ఆయుధ సమీకరణ మునకయి వెచ్చించెనట. నాటినుండి నేటివరకు నున కెంత సొమ్ము పెట్టుబడి పెట్టుచున్నదో మనము నిర్ధారింపలేము. ఆస్ట్రియా, జెకోస్లావికియా దేశములు నాక్రమించి సోవి యటురాజ్యముపయి దూకవలయు నని యాలోచించుచున్నది. హిట్లరునియంత యుద్ధమునకు సిద్ధపడని ప్రభుత్వములతో మైత్రి నెఱపుట వట్టి పనికిమాలినపని యని (మెయిన్ కాంఫ్) అను గ్రంథమందు వ్రాసియున్నాడు. అనగా ఫ్రాన్సు దేశము తన కనుకూలమయిన రష్యాపై దండెత్తవలయునని యాలోచన యాశయమై యుండవచ్చును. యూరపులో బ్రిటనుసహా నాలుగు బలసంపన్నమైన ఫాసిస్టుప్రభుత్వము లున్నవని ఆ పక్షమువారు లెక్కలు వైచుచున్నారు. ప్రపంచార్థికమహాసభలో హెన్ రోజెర్ బర్న్సుగారు రష్యానాశి యూక్రేన్ ఖండమును జర్మనీ వలస భూమిగా నుండవలయునని సూచించుట వలనను భవితవ్య మంతయు తూర్పుదిక్కుననే గలదని హాపి గోబెల్సుగారు చెప్పు చున్నారు. (వికర్సుకంపెనీవారు) బ్రిటిషు ఆయుధ వర్తకులు 1935మ నెలనాటికి 1983550 పౌనుల విలువగల విమానములను జర్మనీప్రభుత్వమునకుసరఫరాజేసిరి. ఒకానొక జర్మన్ సైనికసంచిక లో వలయుచో టాంకులుగూడ పంపగలమని ప్రకటించుట వెర్సైల్లీసు సంధి షరతులనుబట్టి జర్మనీ ప్రభుత్వమునకు విమానములమ్మనుగూడదు ఆ ప్రభుత్వము కొననుగూడదు. ఇది అక్ర

మము గాదా యని ఇంగ్లండుకేసిన అధ్యక్షుని నిలనీయక "మన జాతీయప్రభుత్వ మంగీకరించని పని మే మేమియు చేయుచుం డుటలేదని జవాబు చెప్పెనట. ఆనాడు పునరాయుధ ధారణా వ్యయమునకై యగు ప్రభుత్వమునకు ప్రెసిడెంటుప్రభుత్వము 7,50 వేల పౌనులు అప్పిచ్చెను. ఇంగ్లండు ప్రభుత్వము ఈ అప్పును మంజూరు చేసెను.

ప్రస్తుత మాదిరిగనే ఆకార్యక్రమమునకై యింకొక్కట్లు పౌన్లు ఇంగ్లండు బ్యాంకువారు ప్రభుత్వానుమతితో ఇచ్చి వేయుటకై సిద్ధముగా నుండిరి.

---

## జాతీయ సమితి.

బలవంతుల శిక్షించి బలహీనుల రక్షించుటకు గత మహాయుద్ధములో తాను దిగెనట్లు బ్రిటను దేశము ప్రగల్భములు పల్కెను. అమెరికా అధ్యక్షుడు (ఉడ్రో) విల్సన్ మహాశయుడు) బలహీనజాతులకు స్వాయంనిర్ణయసూత్రము వర్తింపజేయవల యునని పాటలుపాడెను. ప్రతిబంధకములతో గూడిన వర్సె లీసు సంధిపత్రము జర్మనీ దేశమున కంటగట్టిరి. ఇకముందు యుద్ధములు జరుగకుండుటకు పూచీ వహింపగల జాతీయసమి తిని స్థాపించిరి. చిన్న పెద్ద రాజ్యములు దానిలో సభ్యత్వమున

కంగీకరించెను. బ్రిటన్-ఫ్రాంసు దేశముల అధ్వర్యముక్రింద దాని దైనందినచర్య సాగిపోవుచున్నది. 1932 సం॥లో చైనా దేశ భాగ్యమగు మంచూరియాను కబళించుటకు జపాను తనసభ్యత్వ మును వదలుకొనెను. సభ్యత్వము నిలుపుకొనుచు ఇటలీ దేశము అబ్సీనియాను నిన్న మొన్న తన పొట్టబెట్టుకొన్నది. తనకంట గట్టబడిన సంధిషరతులను విచ్ఛిన్నము చేయుటకయి జర్మనీ సభ్యత వహింపలేదు. స్పెయిన్ భూములో అంతర్జాతీయ మగు ఫాసిస్టుసామ్యవాద సంఘర్షణ నేటికిని సాగుచునే యున్నది. శాంతిభద్రతలకయి లోకానుగ్రహార్థము బాధ్యతో వహించిన జాతీయ సమితి సహసభ్యులలో సంకురించిన భేదభావములు తగవులు తీర్పలేక పోరాటములు ఆపలేక ఉక్కిరి బిక్కిరియై నిర్వీర్యమై యున్నది.

యుద్ధానంతరమందు జర్మనీయొక్కయు టర్కీ యొక్కయు రాజ్యభాగములను ఫ్రాంసు బ్రిటను దేశములు తమలో తాము పంచుకొని సాయముచేసిన ఇటలీ దేశమును చిన్నచూపు చూచెను. వెర్సలీసు సంధిపత్రమును చించి చెండా డుటకయి జర్మనీ రంధ్రాన్వేషణము చేయసాగెను. రాజ్యతృష్ణ తో జపాను బాధపడుచుండెను రష్యారాజ్యము నిరంకుశత్వ మును భూస్థాపితము చేసి సామ్యవాదమును చేపట్టెను. స్పెయిన్ లో సామ్యవాదమే ప్రబలిపోయి పీఠము వెట్టుకొనెను. ఫాసిస్టు

నిరంకుశత్వములు ప్రభుత్వములపయి సానుభూతి లేదు. వారిలో వారికి ఐకమత్యము సిద్ధించుట లేదు. రక్తమునిండిన బ్రిటను ఫ్రాంసు దేశములిచ్చు సంధులు సకసకలాడు ఇటలీ జర్మనీలు అంగీకరించవు. ఎవరికి వారు పోటీలతో సైన్యములను ఆయుధబలములను వృద్ధిచేసుకొనుచున్నారు. బలవత్తరమయి దుర్భేద్యములగు కోటలు కట్టుచున్నారు. నిమేషమాత్రములో పట్టణములను భస్మీపటలముచేయు బాంబులను తయారుచేయుచున్నారు. విమానములసంఖ్య పెంచుచున్నారు. నవ్యములగు నౌకాదళముల హెచ్చుచేయుచున్నారు. జాతీయ సమితి తెలతెలపోయి చూచుచున్నది. తన కండ్లయెదుట ప్రాచీనరాజ్యములు అంతరించుచున్నవి. జీర్ణమై పోవుచున్నవి. కమిటీలు, కమీషన్లు, విచారణసంఘములు, ఉపసంఘములు, సలహాసంఘములు, మహాసభలు వీనితో ఎన్నాళ్లు కాలము గడుపుట? ప్రధానసభ్యరాజ్యములుగూడ స్వరక్షణ అను వంకమీద తమను బలపరచుచున్నవి. ఆయుధవినిమయ సభలు వ్యర్థమైనవి. ఆర్థికసభలు అపహాసకరములుగా పరిణమించినవి. ఇక చేయునది ఏమి? ఆయుధోత్పత్తి, బలాభివృద్ధి, దేశరక్షణ, [illegible] మాట [illegible]

ప్రభుత్వములు తమ కాలమును ధనమును వ్యయపఱుచు చున్నవి.

కార్మికుల కవసరమగు తేయాకుమీద పౌను 1 కి 2 పెన్నీల చొప్పున బ్రిటీషుప్రభుత్వము పన్ను విధించెను. సినీమాలలో, సైన్యములలో చేరుడను ఉపన్యాసములు విని పించుచున్నవి. ధనికగణము నడుపు పత్రికలలో యుద్ధవార్తలు వానిని గూర్చిన ప్రజలబాధ్యత పరిచారకము చేయబడుచున్నది. బ్రిటిషు జాతీయప్రభుత్వము 1932 సం॥రంలో జాతీయసమితి యందు రష్యా, ఇటలీ, అమెరికా రాజ్యములవారు చేసిన యుద్ధప్రతికూల విధానముల కడ్డు దగిలి వెర్సయీసుసంధి నియమ ములకు భిన్నముగా జర్మనీప్రభుత్వమును చెలరేగనిచ్చెను. అప్పటి విదేశాంగమంత్రి 6 ఫిబ్రవరి 1934 తేదీని "ఆయుధ బల సమత్వముకోసము జర్మని తంటాలు పడుచున్నది. దాని నాగుటకు వీలులేదు. ఆగనలచుకొన్నను ఆగునది గాదు" అని వెల్లడిచేసెను. ప్రభుత్వమే ఐరోపీయశాంతి వాతావరణమున కల్లోలము చేయుచు శాంతికోరు అమెరికా ఫ్రెంచిప్రభుత్వముల పైనను ఆవల రష్యా సామ్యవాదప్రభుత్వముమీదను దుమ్మెత్తి పోయుచున్నది. ఇటలీలో ముస్సోలినీ, జర్మనీలో హిట్లరు

పోలండులో పిల్ సుడిస్కి (ప్రస్తుతము చనిపోయినాడు), ఆస్ట్రియాలో షుషినిగ్, హంగేరీలో హార్తి, యుగోస్లావియాలో కె. అలెగ్జాండరు, స్వీడన్ లో ఫ్రాంకో, ఇంగ్లండులో ఆస్వాల్డు మోస్లే, జపానులో సైనికాధికారులు చేయు, ఆందోళన ఆత్మాభిమానముల మూలమునసే ప్రపంచశాంతి భంగమై యుద్ధోపద్రవము నికటస్థమగుచున్నది. సామ్రాజ్య తత్వముతో గూడిన బ్రిటను, ఫ్రాన్సు, అమెరికాదేశముల నాయకత్వమును సమ్మర్ది సమితిపరియోజనమును వ్యర్థము చేయుచు వట్టి నిగుసమయోగసంస్థగా చేయుచున్నారు. సమిష్టిరక్షణకొఱకు రాజ్యములన్ని సంఘపత్రాలు వ్రాసికొన్నారు. యుద్ధభయము నానాటికి అభివృద్ధి చెందుచున్నది. బ్రిటిషువారి విదేశాంగ రాజకీయములకు సంబంధించిన కార్యాలయములలో పనిచేయువారిసంఖ్య 1913 నుండి 1932 సం॥మునకు 1e3 నుండి 766 వరకు పెరిగిపోయెను. రానురాను సంఖ్య పెరుగుచున్నదే గాని తగ్గుటలేదు. అబ్సీనియా యీ స్పెయిన్ యుద్ధములవల్ల జాతీయసమితిచేతగానితనము పూర్తిగా లోకమునకు విశ్రుతమయ్యెను. దాని యాజమాన్యమున నడుచు పరిత్యజనహారము వట్టిబూటకము మాయానాటకము అని సామ్యవాదులు నమ్ముచున్నారు.

# బ్రిటిషువారి యుద్ధసన్నాహము

1935 సంవత్సరములో ఆయా ప్రభుత్వములకు గల సైన్య నౌకా విమానములబలమును ముందు తెల్పుచున్నాము. తరువాత జాతీయ ప్రభుత్వ వ్యవహారములను ముచ్చటింతుము.

| దేశములు | మనుష్య బలము. | విమానములు | యుద్ధ నావలు. | క్రూయిజర్లు. | డిస్ట్రాయర్లు | జలాంతర్గాములు. |
|---|---|---|---|---|---|---|
| బ్రిటను | 154000 | 1500 | 15 (3) | 64 (14) | 169 (48) | 51 (1) |
| జపాను | 300000 | 2000 | 9 | 33 | 96 | 57 |
| ఇటలీ | 510000 | 1700 | 8 (4) | 27 (4) | 96 (30) | 64 (7) |
| జర్మనీ | 550000 | 2000 | 13 (5) | 7 (1) | 30 (13) | — |
| అమెరికా సం॥ రా॥ | 145000 | 2400 | 15 | 30 | 115 | 50 |
| ఫ్రాంసు | 560000 | 3000 | 13 (3) | 60 (3) | 77 (25) | 139 (30) |
| రష్యా | 1300000 | 2000 | 4 | 7 | 19 | 53 |

[illegible]
తయారగుచున్నవి [illegible]
[illegible] బలములు [illegible]

ప్రస్తుతమందు జాతీయప్రభుత్వసన్నాహము మూడు భాగములుగా విడదీయవచ్చును. ఇదివఱకు చేసిన ప్రస్తుతము జరుగుచున్న 1937-40 సం॥ములవఱకు, ఆపైని జరుగనున్న కలాపమని చదువరులు గుర్తింతురు గాక. 1913-14 లో సైన్య, నౌకా, విమానబలముల మీద బ్రిటిషు ప్రభుత్వము 770 లక్షల 18 వేల పౌనులు వెచ్చించెను. 1936-37 లో ఆ ప్రభుత్వమే 1580 లక్షల 25 వేల పౌనులు వెచ్చించుచున్నది. ఈలక్షలు చాలక యింకను అదనముగా మఱొక 7 కోట్ల పౌనులు శ్వేతపత్రికరీత్యా వెచ్చింపనై యున్నదట. బాల్డ్విన్ మంత్రి 25 కోట్ల పౌనులు అప్పుచేయ దలచుకొన్నట్లు చెప్పుచున్నాడు. లండను బ్యాంకర్లు 30 కోట్లవఱకు రాగల దని తలచుచున్నారు. చేంబర్లేనుగారు రాగల సంవత్సరములలో ప్రభుత్వము విరివిగా ఆయుధములకయి హెచ్చు సొమ్ము వెచ్చింప సిద్ధపడవలయు నని బడ్జెటు సందర్భమున మనవి చేయుచున్నాడు. 1936-37 సం॥ రములకు వేసిన అంచనా 7 కోట్లే గాక 1940 తుదముట్టునరికి సం॥ రం 1కి అదనముగా 2 కోట్ల పౌను లింకను పట్టక మానదని "ఫైనాన్షియల్ న్యూస్" ఆనుపత్రిక తేల్చివైచుచున్నది. ప్రపంచశాంతికై తద్వారా స్వీయరక్షణ కయి జాతీయప్రభుత్వము ఆయుధ సమీకరణముసకు—

1. మునుపు నాలుగేండ్లక్రిందట వెచ్చించిన సొమ్ము మీద 100కి 50 చొ॥న ఈసంవత్సరము వెచ్చించుట,

2. మూడేండ్ల వఱకు శ్వేతపత్రిక అంచనాలనుబట్టి 7 కోట్ల పౌనులు ఖర్చుచేయుట,

3. ఆపైన తగ్గింపరాని లెక్కల ప్రకారము 11 కోట్ల పౌనులు 5 యేండ్లవఱకు సెలవు చేయుట,

ఈమూడునువిధాయకముగ జరుగవలసిన కార్యములు.

---

# ఎవరు బాగుపడుదురు?

ఇంతంత పెద్ద మొత్తములు ప్రభుత్వమువారు సెలవు చేయుచున్నప్పుడు లాభము లెవరికి దక్కును? ఆ విషయమును గూర్చి నిర్ధారింతము. యుద్ధ మార్థికముగా లాభకరమని లెనిన్ మహాశయుడు పూర్వమే చెప్పియున్నాడు. జనసామాన్యమునకు యుద్ధ మక్కరలేదు. వారికి శాంతియే కావలయును. బ్రుసెల్సు పట్టణములో ప్రపంచశాంతి మహాసభ జరిగెను. యుద్ధ మనవసర మని తీర్మానించెను. బ్రిటిష్ దేశములోని శాంతిసంఘము ప్రజల సమ్మతులు తీసుకొనెను. 1 కోటి 15 లక్షలమంది నాశంకరమగు సంగ్రామమును గర్హించిరి. కాని రోథర్మియార్, బీవర్ బ్రూక్ ప్రభువులు, వారి పత్రికలు,

వారి ధనరాసులు, భూశాంతికాముల యుద్ధనిరోధము దేశాభివృద్ధిబాధకమని ఖండింపసాగిరి. ప్రభుత్వమువారును వీరి చేత బాగు సుముఖముగా ప్రేరింపబడిరి. 1931 ఆగష్టు మాసమున తొలి వారి జాతీయప్రభుత్వము [illegible]బాధ్యత వహించెను. అప్పటినుండి నేటివరకు ఆయుధపరిశ్రమకు పెట్టు బాగుపడిరో, అభివృద్ధిగాంచిరో దిగువనిచ్చిన లెక్కలు ఋజువు చేయగలవు. దేశము మొత్తము మీద 20 కంపెనీలు ఆయుధవ్యాపారమును సాగించుచున్నవి. వానిలో అగ్రగణ్యములయొక్క వివరములు వ్రాయుచున్నాము.

వికర్సుకంపెనీవారు

| | | |
|---|---|---|
| 1931 లో | 574493 | ఈ సంవత్సరాలు వాటాదార్లకు నూటికి క్రమముగా 5, 4, 4, 6, 8, చొ॥ లాభములు పంచిపెట్టిరి. |
| 1932 ,, | 529438 | |
| 1933 ,, | 543364 | |
| 1934 ,, | 613261 | |
| 1935 ,, | 928105 | |

వికర్సు, హాడ్‌ఫీల్డ్సు, కామెల్ లైర్డ్సు, స్వాన్‌హంటర్, రోల్సురాయిస్, డి. [illegible]యర్, ఫైర్, అను యేడు కంపెనీల తాలూకు మొత్తము లాభము [illegible] యుండెను. అనగా పెట్టిన పెట్టుబడిమీద నూటికి 200 వరకు లాభములు తేలినవట.

ప్రస్తుతమందు ఒక్క వికర్సుకంపెనీవారికి

| | |
|---|---|
| మరతుపాకులు<br>ఫిరంగులు<br>టాంకులు, నౌకలు, మోటార్లు, ఇంజనులు<br>మొదలగు మహాభారసాధనము లమ్మటమువలన | పౌనులు<br>565000 |
| విమాన నిర్మాణమువల్ల ... | 150000 |
| ఇతర అదనములు చిల్లర నిర్మాణములవల్ల | 565000 |
| మొత్తము | 1290000 |

లాభమువచ్చునని సంకుచిత స్వభావముగల "ఫైనాన్షియల్ న్యూసు" వ్రాయుచున్నది. గతసంవత్సరము ఈకంపెనీకి 928,105పౌన్లు లాభమువచ్చెనట. ఇతరకంపెనీలుగూడా నిట్లే విపరీతలాభములు వచ్చునని ఆపత్రికయే ఊహ చేయుచు, అందలివాటాలు తీయడానికి ధనవంతులను ప్రోత్సహించు చున్నది. విలియంబెర్డ్మూర్ అనుకంపెనీ (గ్రేంపుల్సు)నుండి ఇంగ్లండు బ్యాంకుయొక్కయు ఇతర చిల్లరబ్యాంకులయొక్కయు మూలధనముతో నిర్వహింపబడుచున్నది. పునరాయుధ నిర్మాణ సమస్య యుద్భవింపకున్నచో ఆకంపెనీ దివాలాతీయవలసినదే. నిరుటికన్న నీయేడు విమానములసంఖ్య మూడింతలు పెరగ వలయునని ప్రభుత్వమువారు సంకల్పించిరట. చిల్లరకంపెనీల వారిని ప్రధానకంపెనీలు తమ [illegible] వర్తకము సాగించుచున్నారు. ప్రభుత్వము [illegible]

నిచ్చి ప్రోత్సహించుచున్నది. దేశములో ఒక్క బొగ్గుపరిశ్రమ తప్ప తక్కిన యినుము, ఉక్కు లోనగు మహాభారపరిశ్రమలు విరివిగా సాగుచున్నవి. యుద్ధజ్వరము పనిలేని కార్మికులకు పని చూపించుచున్నది. కాని ఈపరిశ్రమలు కార్మికసంస్థలు (ట్రేడు యూనియనులు) లోనగునవి లేనిపట్టణములయందును దేశములలో నూరునూరులయందు క్రొత్తగా నెలకొల్పబడిన కర్మాగారములయందును సాగింపబడుచున్నవి. కొందఱు నేర్పరులైన పనివారల చేరదీసి, చాలమంది క్రొత్తవారిని (తక్కువ కూలికి) వారికి జేర్చి విశేషముగా యుద్ధావసరముల నుత్పత్తి చేయుచున్నారు. ఈయెత్తువల్ల కార్మికవర్గములలో అలజడియూ లేదు. యజమానులకూ లాభములు కనబడుచున్నవి. ప్రభుత్వమునకూ వారిపని వారికి తీరుచున్నది. జాతీయసమితి కూడ పూలిసనంస్థయై యుద్ధనివారణకు ఇంకను అవకాశముస్నదని లోకమునకు చాటించుచున్నది.

---

## యుద్ధ మాగదా?

కార్మికులు తలచుకొన్నచో యుద్ధ మాగితీరునని "హారీ పోలిట్" అను కమ్యూనిష్టు నాయకుడు స్వానుభవము నిట్లు చెప్పుచున్నాడు. "రష్యా కార్మిక కర్షకులు 1917లో జారు ప్రభుత్వమునునాశనముచేసి సామ్యవాదప్రభుత్వమును స్థాపించిరి.

దాని కానాటి ప్రభుత్వము విరోధియైయుండెను. బ్రిటిష్‌ప్రభుత్వమును ప్రతిఘటింప ప్రారంభిన బ్రిటను దేశములు యుద్ధము చేయసాగెను. ప్రపంచ కార్మికులకు రష్యాపై (ముఖ్యముగా బ్రిటిష్‌వారనుగువారికు) నానుభూతి గలదు. లెనిన్ మహాశయుని సందేశమువల్ల కార్మికులు "రష్యాపై చేయివేయరాదు" అను నొక మహోద్యమమును లేవదీసిరి. (1919) అపూర్వముగా ప్రచారముచేయుచు మహత్తరమగు ప్రభోధము గల్పించిరి. ప్రతి కార్మికుడు తనవిధి తాను నెరవేర్ప సిద్ధమైయుండెను. దీక్ష వహించెను. ప్రభుత్వమువారును కార్మికరాజ్యమును త్రొక్కివేయ కంకణముగట్టుకొనిరి. రష్యారణభూములలో వీరయోధులు కట్టుబడిపోయెను.

పోలండు దేశమునకు మందు గుండు తుపాకులు సరంగులు లోనగు సాధనసంపత్తి నంపి విరోధుల లొంగదీయ జూచుచుండిరి. మేమును అట్టి ఉపపత్తులు వారికి చేరకుండునట్లు చేయవలయునని పట్టుదలతో సమ్మెలయినను సాగించ సిద్ధమైయున్నాము. నిరంతరప్రభోధమువల్ల నుద్రేకము, అశాంతి, దీక్ష మిక్కుటమైపోయెను. సంకోచించుచు ప్రభుత్వమువారు హెచ్చుకూలి యిచ్చుటకు తీర్మానించిరి. ప్రథమములో బెల్జియం దేశపు బార్జీలు (పెద్దనావలు) రెండిటిపై యుపకరణములతో నింపి పంపివైచిరి. అందులో పనిచేయునా రందరును మావారే. వారికి మా ప్రబోధము పూర్తిగా తలకెక్కెను

రేవులో పనిచేయు కార్మికులకుగూడ సమ్మెచెప్పినాము. వారును తమ కర్తవ్యమును నూహించుకొనిరి. బొగ్గు వేతగాండ్రను మా అభిప్రాయములకు అనుకూలముగా చేసికొన్నాము. తీరమును దాటి "సాంప్సన్‌స్టోన్" బోట్లు ప్రవేశించినవి. త్రాళ్ళు తెగి పోయి సామానులన్నియు సముద్రమున పడిపోయినవి. ఇట్లే రెండవ మారు మరలా ఓడ సామానులను పంపినారు. అదియు థేమ్సు నదిలో మునిగిపోయి ఓడ సామానుపట్టు నీటిపాలయ్యెను. మూడవ మారు "జాలీ జార్జి" యను ఓడను తయారుచేసిరి. 1920 మే 10వ తేదీని లండను రేవు కూలీలు సమ్మెచేసిరి. వారివలెనే పని వాండ్రముగుడు ఓడకు బొగ్గు వేయుటలేదు. నావికులు ఎవరిదారిని వారు తొలగిపోయిరి. 15 తేదీని ఓడలో వేయించిన సామాను తిరిగి బయటకు దింపుకొన్నారు. పార్లమెంటులో 1920 మే 6 తేదీని బోనర్లా మంత్రి పోలండు దేశమునకు ప్రభుత్వము వారి ఆయుధములు సప్లయి చేయుటలేదని బొంకివైచెను. ఈనాడు 1919 అక్టోబరు నెల నుండియు బ్రిటిష్ ఫ్రెంచి ప్రభుత్వములు వారి ఖర్చులతో యుద్ధసామానును పోలండు దేశమునకు పంపు చున్నారని ఒప్పుకొనక తప్పినదికాదు. ఈ విశ్లేషము కార్మికు లలో అభూతమైన సంచలనము కలిగించెను. వారేమిచేయు మన్న అది చేయుటకు సర్వసన్నద్ధులై యుండిరి. ఈ మా కట్టుబాటుతో యుద్ధ మాపగలిగితిమని సగర్వముగా చెప్పు చున్నాను.

ఇప్పుడట్టి కట్టుబాటు కార్యదీక్ష కార్మికులలో గాన్పిం చుటలేదు. కావుననే అబీసీనియా దేశము అన్యాకా . . స్పెయిన్ పోరాటము చల్లాపుట లేదు. . . . . . పరిస్థితులలో గూడ మార్పు లగుపించుచున్నవి. కావుననే ప్రభుత్వములు యథేచ్ఛగా తమ కార్యక్రమము జరుపుకొను చున్నవి.

---

# మన సందర్భము.

ప్రభుత్వమువారికి (బ్రిటన్ దేశమునకు) గత మహా యుద్ధములో మన దేశము విశేషముగు ధనసహాయ మొనర్చియు మనుష్యుల సంపియు నానావిధముల తాను అష కష్టముల ననుభవించెను. స్వయంనిర్ణయసూత్రము మనకు ప్రత్తింప జేయలేదు. సరిగదా ప్రభుత్వము వారి నిరంకుశత్వము హా మీఱుచున్నప్పుడు దేశీయమహాసభ ప్రతిఘటించుచు స్వరాజ్య సంపాదనకొఱకు సక్రమాందోళనము చేయుచున్నది. గాంధీ మహాత్ముని నాయకత్వమున ప్రేమ, అహింసా తత్త్వముల వరించి వానినే ఆయుధములుగా దేశీయులు వాడుచున్నారు. యుద్ధములవల్ల బీదసాదలే హెచ్చుగా బాధపడుచురని గుర్తించు చున్నారు. స్వసంరక్షణవిధాయక కృత్యమున్న మాగు కంగీక

రింపవలసినదే కాని హిందూదేశము పరోక్షమారు తనకు లాభములేని ప్రపంచయుద్ధములలో త్యాగము సల్పునన్న విష యమును ప్రస్తావించి సమ్మతించేము. యుద్ధమువల్ల జాతి వీర్య వంతమగుచున్న దేశము స్వాతంత్ర్యము యథార్థము. యుద్ధము జగద్వ్యాపితమగునపుడు స్వయముగా అవశ్యము పాయపడవలసినదే. నిర్వీర్యము నిస్సహాయము అగు జాతిని ప్రభుత్వము స్వేచ్ఛమై నాడించగలదా? ప్రభుత్వమునకు అంగబలము, అర్థబలము లేకుండునా?

- ----

# రాబోవు యుద్ధమునకు ఆస్కారము

రాబోవు యుద్ధమునకు సోవియట్టురష్యా, ఫ్రాన్సు, ఇంగ్లండు, బెల్జియము, శ్చెకోస్లావిక్యా ఒక వైపునను, జర్మనీ, ఇటలీ, జపాను, హంగేరీలు మరో వైపునను వుండునేమో అనియు, శ్చెకోస్లోవిక్యా దేశము సోవియట్టు రష్యా, జర్మనీ దేశాలకు నడిమధ్యగా నున్నదనియు, యుందే యుద్ధమునకు తగిన ఆస్కారము సోవియట్టు రష్యా, జర్మనీలకు ఏర్పడు ననియు ఇంగ్లండులోని ఫాసిస్టుపక్షంవారు వారి పత్రికలలోను వారి పుస్తకాలలోను వెల్లడించుతూ ఇంగ్లండు జర్మనీతో పాటే వుండాలని హెచ్చరిస్తున్నారు.

కాని ఈమధ్యనే బ్రిటనుకు ఫ్రెంచుకు జరిగినవడంబడిక వల్ల బ్రిటను, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీలు ఏకముగానుంటూ, జర్మనీ పశ్చిమవైపునకు రాకుండా తూర్పువైపునకు వెళ్ళుటకు అడ్డు తగలకుండానుండే ఏర్పాట్లు జరిగినట్లు వదంతి వుంది ఈవడంబడికి భయపడే కాబోలు జర్మనీ తూర్పునవున్న దేశాలన్నీ కలిసి యునైటెడ్ స్టేట్సు ఆఫ్ యూరప్ గా, పోలెండు, చెకోస్లోవిక్యా, రొమేనియా, యుగస్లోవియా, గ్రీస్, టర్కీ-దేశాలు ఏకమగుటకు యత్నాలున్నటుల వదంతివుంది. దీనిని బట్టి రష్యాను యూరపుఅంతా వెలివేసినటు అగునేమో అని రాజకీయ ధురంధరులు అనుకొంటున్నారు.



## ఇంగ్లండులోని ఫాసిస్టులు-ఇండియా.

గత మహాసంగ్రామానంతరం ప్రభుత్వాలు తగిన కట్టుదిట్టాలతో లేనందుననే డిక్టేటరు ప్రభుత్వాలు ఏర్పడుతున్నాయి. గాన ఇట్టి స్థితిలో ఇండియాకు ప్రజాప్రభుత్వం యివ్వవలెనని ఇంగ్లండులోని ప్రజలలో కొందరు తలపడంతప్పనే అభిప్రాయాన్ని యీఫాసిస్టుపక్షంవారు ప్రచారం చేస్తున్నారు. ఇంతే గాక "ఫాసిజం" అను పేరిట 100 ప్రశ్నలు వీటికి జవాబుతో ఇంగ్లండులోని ఫాసిస్టు నాయకుడైన సర్. ఆస్వాలు మోస్లే

వ్రాసిన గ్రంథంలో అవసరమైతే ఇండియాలో నున్న ప్రత్తి మిల్లులను నావికాపరిశ్రమను మూసివేయుటకు తగిన ఏర్పాట్లు చేసి ఇంగ్లండులోని కార్మికులకు తగినంత పనిని కల్పించుతామని 62-వ ప్రశ్నలో జవాబు ఇచ్చెను. దానినిబట్టి ఇండియా అన్న ఫాసిస్టులకెంత ప్రేమ ఉందో గ్రహింపుడు.

ప్రభుత్వములు, ప్రజానాయకులు హృదయపూర్వకముగ మానవసౌభ్రాతృత్వమే కోరినయెడల సులువుగా తప్పక శాంతిచేకూరగలదు. లేదా శాంతికొరకు కార్మిక కర్షకులు ప్రత్యేకకృషిని గావించి ప్రభుత్వ పరిపాలనలో మార్పులు గావించవలెను.

ఓం శాంతిః



# అనుబంధము 1.

# "బ్రిటిషుసామ్రాజ్యపు మొలత్రాడు"

## సూయజుకెనాలు చరిత్ర

ఆచార్య రంగాగారు

ఈనాటి వరకు బ్రిటిషు సామ్రాజ్యము నిల్చియున్న దంటే ముఖ్యకారణాలలో ఒకటి, సూయజు కెనాల్ మీద వారి పెత్తనమే! ఈ కాల్వ అటు మధ్యధరా సముద్రము, యిటు యెర్రసముద్రాన్ని కల్పుతుంది. ఈకాల్వకు యిరు ప్రక్కల అరేబియా, యీజిప్టు దేశాలు ఉన్నవి. దీని యూరపుఖండ తలకట్టువద్ద పోర్టుసెయిదు, ఆసియాఖండ మొలకట్టువద్ద యేడెను పట్టణాలున్నాయి. ఇన్నాళ్ళనుండీ, యేడెను మన దేశపు టధికారం క్రిందనే వుండెను గాని, మన కేదో స్వరాజ్యం ఇవ్వక తప్పదను భయముచేత, బ్రిటిషువారు దాన్ని తమ క్రిందకే తీసుకొన్నారు ఈకాల్వే లేకుంటే, భారత దేశానికి రావటానికై స్టీమరులో ఆఫ్రికాఖండమును చుట్టుచూ మరొక పదిరోజులైనా ప్రయాణం చేయాల! యుద్ధకాలంలో యీ యిబ్బంది యెంతో, 1904 లో రషియా జపాను మధ్య లడాయి సాగినప్పుడు రషియా స్టీమరులను, యీ కాల్వగుండా బ్రిటిషువారు పోనీయకపోవుటవల్ల, రషియా

ఓడిపోవుట ద్వారా తెల్లమైనది. అబిస్సీనియాను జయించుటకయి ముస్సోలినీ ప్రయత్నించుచున్నప్పుడు, "శాంక్షన్సు"ను ప్రయోగించుతానని బ్రిటిషుప్రభుత్వము పూనుకొనగా, సూయజుకెనాలును మూసిరా, బ్రిటిషువారిపై యుద్ధానికి బయలుదేరుతాననీ, ముస్సోలినీ పలుకవలసి వచ్చింది. ఇప్పటి కాల్వపై తనకుగూడ కొంత పెత్తనం కావాలనే ముస్సోలినీ పంతం. దీనికి దారిలోనె వున్నది జిబ్రాల్టరు. అయ్యది స్పెయినుదేశపు దక్షిణ కొన. దానికేమి తంటావచ్చునో యను భయమే "స్పెయిను యుద్ధములో ఎవ్వరూ చేర రాదు" అను బ్రిటిషువారి పట్టుదలకు కారణము. యుద్ధకాలాన, అరేబియనులకు స్వాతంత్ర్యప్రసాదము చేసెదమని చేసిన వాగ్దానాలు మరచి, ఎచ్చటెచ్చటో ఉన్న యూదులను పాలస్తయినులో తెచ్చిపెట్టి, దానిపై తమ పెత్తనము స్థిరపరచుకొనుటకు బ్రిటిషువారు పాల్పడుటయూ ఈ కాల్వపై తమకుగల పెత్తనాన్ని స్థిరపరచుకొనుటకే!

ఈ కాల్వ, దక్షిణ వుత్తర అమెరికాల కల్పు పనామా కాల్వకంటె ముఖ్యము. అది ప్రంచయుద్ధమునందు, త్రిపురాసురులకు రహాదారి.

క్రీస్తుకు పూర్వము 600 సం॥ క్రితమే ఈజిప్టులోని, నైలునదిని యెర్రసముద్రముతో కల్పుటకై, ఈజిప్టువారు ఒక కాల్వ త్రవ్విరి. అట్టి కాల్వలనే, డరియసు, టోలమీ

రాజులు త్రవ్వించిరి. పశ్చిమదేశాలవారికి, టర్కీమీదుగా ఆసియాదేశాలకువచ్చుటకు భయంకరప్రయత్నమైనప్పటినుండి, అనగా, పదహారో శతాబ్దమునుండి, యీలాంటి గొప్ప కాల్వ యీ రెండు సముద్రాలను కలుపుటకై త్రవ్వుట మంచిదని అనేకులు తలచుచుండిరి. వెనీసు పౌరులు దాన్ని త్రవ్వించ దలచిరట. ఎలిజబెత్తు రాణి గూడ ఆలోచించెను. పిమ్మట 19 శతాబ్దపు ప్రారంభాన, నెపోలియనుగూడా త్రవ్వించా లనుకొనెను. పిమ్మట బ్రిటిషు, ఫ్రెంచి, యిటలీ, యింజనీయరులు ప్లానులు తయారు చేసిరి కాని, భాగాలు కుదురక, పరస్పరంగా విశ్వాసము లేక, వారి ప్రభుత్వాలు కార్యానికి పూనుకోలేకపోయినవి. 1858 లో, ఫర్డినాండు లెస్సెప్సు అనే ఫ్రెంచి యింజనీయరు, రాయబారి, యీజిప్టు పాషావద్ద అనుమతిబొంది, 1859 లో త్రవ్వ ప్రారంభించి, పూర్తి చేయించెను.

ఆ కాల్వను నిర్మించిరో, లేదో, దానిపై 'మాకు, మాకు' అని పెత్తనానికై ఫ్రాన్సు, యింగ్లండు తగవులాడు కొన ప్రారంభించెను. యూదుడును, జిత్తులమారియగు డిస్రైలి అనే బ్రిటిష్ ప్రధానమంత్రి రు. 5 కోట్లు సహాయాలకు యీజిప్టు రాజువద్ద, ఆతని పేరుల నన్నింటిని రహస్యంగా కొనెను. దాంతో, ఆకాల్వ బ్రిటిష్ పెత్తనంక్రిందకు వచ్చింది.

("[illegible]")

# అనుబంధము 2.

## బ్రిటీషు రాజులు—పూర్వాపరములు

### 8వ హెన్రీ మొదలు 6వ జార్జివరకు పాలించినరాజులు.

1500 సంవత్సరములకు పూర్వము ఇంగ్లండుయొక్క పరిపాలన సరియైన కట్టుదిట్టాలలో లేదు. 1500 తర్వాతనే ఇంగ్లండుయొక్క ప్రతిభ వెల్లడియయ్యెను. 1500 సం॥రములకు పూర్వము భారతదేశము మంచి ఔన్నత్య స్థితిలో నున్నటుల హిందూదేశచరిత్రయే చెప్పుచున్నది. ఇంగ్లీషువారు భారతదేశమునకు వర్తకులుగా 16వ శతాబ్దములో వచ్చి క్రమేణా రాజ్యమును వశపర్చుకొనిరి. ఇంగ్లండు, ఆర్థికంగా వృద్ధిచెందిన కొలదియు భారతదేశము ఆర్థికంగా క్షీణించెను. [ ఈవివరాలు డా॥ భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులు గారు ఆంగ్లమున వ్రాసిన "ది ఎకనామిక్ కాన్‌క్వెస్టు ఆఫ్ ఇండియా లేక బ్రిటిషు ఎంపైరు లిమిటెడ్" అను గ్రంథమందు వివరింపబడెను. ఈ గ్రంథమును రాజమండ్రిలో నున్న హిందూస్థాన్ పబ్లిషింగు కంపెనీవారు ప్రచురించిరి. ]

మనపాఠశాలలలో బ్రిటిషుచరిత్రకు హెచ్చుప్రాముఖ్యము [illegible]

ఏలా జయించినదియు బ్రిటిష్‌వారివల్ల కలిగినలాభాలు ఉన్నవి లేనివికల్పించి వ్రాసిన చరిత్రలనే నేర్పుదురు. బ్రిటిషువారివల్ల లాభముకలిగినచో భారతదేశీయులు స్వాతంత్ర్యంకోసం సత్యాగ్రహమును 1920 నుండియు సాగించి అఖండత్యాగమును అనేక కష్టాలకుఓర్చి చేయడం అగత్యమేలేదు. సంపూర్ణస్వాతంత్ర్యం చేకూరువరకు భారతీయులకు శాంతేవుండదు.

మన భారతదేశంలోని ప్రజలలో మతకలహము లున్నాయని బ్రిటిషువా రంటారు. బ్రిటిషుచరిత్ర జూచిన బ్రిటిషువారిలో కూడ క్రైస్తవమతములో నుండే కాతలిక్కులకున్ను ప్రొటెస్టెంట్లుకున్ను హోరాహోరిని పోరాటములు జరిగినటుల తెలియును. బ్రిటిషుదేశపరిపాలనలో రాజు కుండే నిరంకుశహక్కును క్రమేణా తగ్గించి ప్రజాప్రతినిధులతో కూడిన శాసనసభకే పరిపాలనాహక్కు లుండునటుల చట్టములను మార్పు చేసుకొనిరి. ప్రస్తుత బ్రిటిషు పరిపాలన బ్రిటిషు ప్రధానమంత్రియొక్క పార్టీఆశయములనుబట్టే జరుగుచున్నది.

---

# బ్రిటీషు రాజులు.

## 8-వ హెన్రీలగాయతు నేటివఱకు ట్యూడరు యుగము (1509-47)

ట్యూడరు రాజ్యాధిపతుల వంశమునకు చెందిన ఏడవ హెన్రీ 1485-1509 వరకు రాజ్యము చేసెను. ఇతనిసు టీను ట్యూడ

రువంశములోనే జన్మించెను. ఈతడు ఆంగ్ల దేశమం దంతటికి రాజు అవవలెనను కుతూహలముతో ఆంగ్ల దేశ మంతటిని కలవరపరచెను. ఈతని అనంతరము ఎనిమిదవ హెన్రీ రాజ్యాధిపతి అయి ఈ క్రింది గురైన మార్పులను గావించెను.

1. జాతీయ భావములను ఆంగ్లేయ ప్రజలలో పురికొల్పెను.

2. క్రైస్తవ దేవాలయాధిపతులకుండే అధికారప్రాబల్యమును తొలగించెను.

3. రాజే ఎక్కువబలముకలవాడనే సంగతిని ప్రజలలో వ్యాపింపజేసెను.

4. చిన్న చిన్న రాజుల ప్రాబల్యమును లేకుండా జేసెను.

5. మధ్యతరగతిలోనుండే ప్రజలందరిని తన చెప్పుచేతలలో నుండునట్లు జేసికొనెను.

ఈతని కాలములోనే అనగా 1529-36 మధ్య బ్రిటిషు పార్లమెంటును సంస్కరించి పార్లమెంటునకు రాజే ముఖ్యుడను రీతిని చట్టమును గావించెను. నావికాదళమును వృద్ధిజేసి యూరపు దేశములన్నిటికి ఇంగ్లండుయొక్క ప్రాముఖ్యతను గనబరచెను.

## ఆరవ ఎడ్వర్డు (1547—1553)

హెన్రీయొక్క ఏకపుత్రుడే యితడు. ఇతడు 10 పండ్ల పసిబాలుడగుటవల్ల యీతని మేనమామ అయిన ఎడ్వర్డు సెమూరును ఆరవఎడ్వర్డునకు గార్డియనుగా ఏర్పరచి యీ సెమూరునే రాజుగ నియమించిరి. ఈతని దుష్పరిపాలనవల్ల యితనిని వధించిరి. ఈతని అనంతరము వార్విక్కు ఆరవ ఎడ్వర్డునకు గార్డియనుగ వచ్చెను. అప్పటికి ఆరవ ఎడ్వర్డునకు 15 పండ్ల వయస్సు. క్షయరోగముచే యీ బాల్యవయస్సునందే యీఆరవఎడ్వర్డు చనిపోయెను.

## మేరీ (1553—1558)

8-వ హెన్రీ ప్రథమ కుమార్తె ఆరవఎడ్వర్డుయొక్క పెద్దఅక్క. ఈమెకు 30 పండ్ల వయస్సున ఆంగ్ల రాజ్యాసీన మును అలంకరించెను. 40-వ ఏట స్పైను రాజకుటుంబము లోని ఫిలిప్పును వివాహమాడెను. ఈ వివాహమునకు తన చెల్లెలు ఎలిజిబెత్తు యిష్టపడలేదనే అనుమానకారణమున ఆమెను కారాగారమునకు పంపెను. ఈమె అనుకొనినరీతిని రాజ్యమును పరిపాలింపలేకపోయెను. ఫ్రాన్సుతో వైరము సంభవించెను. యీ వ్యాకులంవల్ల వ్యాధిగ్రస్థురాలై చని పోయెను.

## ఎలిజబెత్తు (1558–1603)

మేరీ అనంతరము ఆమె చెల్లెలును, 8వ హెన్రీ రెండవ కుమార్తెయు నగు ఎలిజబెత్తు బ్రిటిషు రాజ్యమునకు పట్టాభిషిక్త యయ్యెను. అప్పటికి ఆమెకు 26 సంవత్సరముల ప్రాయము. అతి రూపవతి. పెక్కు భాషలు మాట్లాడే శక్తి, రాజ్యకౌశలము మున్నగు నెన్నియో సుగుణము లుండెను. వివాహము చేసుకొన్న రాజ్యమునకు ఎక్కువ ముప్పు వాటిల్లు నను భయముతో వివాహము మానివేసెను. ఈమె పరిపాలనలో బ్రిటనులో శాంతి అభివృద్ధి సంపద వృద్ధియయ్యెను. 1589 లో [illegible] విఫలుడై బట్టలు కుట్టే యంత్రమును కనిపెట్టెను.

అమెరికా, ఆఫ్రికా, ఇండియా, చీనా దేశములను బ్రిటిషు యువకులు సముద్రయానమువలన కనుగొని బ్రిటిషు వర్తక వ్యాపారము ఆదేశాలతో వృద్ధి గావించి క్రమేణ రాజ్యాక్రమణను గావించిరి.

---

## స్టూవర్టు యుగము.

### ఒకటవ జేమ్సు (1603–25)

ఇంతకు పూర్వమితడు స్కాట్లండునకు రాజు. ఇతని కాలమున యూరోపు మహాశక్తులతో [illegible] విదేశాంగ వ్యవహారములలోను [illegible] పోయెను.

## మొదటి చార్లెస్ (1625-49)

ఈతడు ఆశ్రియపక్షపాతి. పార్లమెంటుతో హెచ్చుగా సఖ్యముతో నుండలేదు. సాంఘిక విప్లవములు గలిగెను. 1649లో చనిపోయెను. నిరంకుశ పరిపాలన గావించెను.

## రెండవ చార్లెస్ (1660-85)

పార్లమెంటును లెక్కచేయలేదు. ఉంపుడుకత్తె కుమారునికి రాజ్యము యియ్యజూచెను. మతకర్తలతో కలసి మెలసి వుండలేదు.

## రెండవ జేమ్సు (1685-88)

కాతలిక్ మతస్థుడు నిరంకుశాధికారి. పార్లమెంటును లెక్కజేయలేదు. ఈతనిపైకి ఆరెంజినుండి విలియం దండయాత్రకు రాగా ఫ్రాన్సుకు తన కుమార్తె ఆన్నె అను ఆమెను వదలివేసి పారిపోయెను. ఇంగ్లాండుయొక్క భాగ్యపేరు మారె.

## మూడవవిలియం ఆనె (1689-94)

## మూడవ విలియం (1694—1702) ఆన్నె (1702-14)

ఈ ముగ్గురు యీ పైనవ్రాయబడిన కాలములో రాజ్యమును చేసిరి. వీరికాలమున ఫ్రాంసుతో యుద్ధంబు జరిగెను. ఇంగ్లీషువారి సామ్రాజ్యముయొక్క విస్తీర్ణతయు పెరిగెను.

## బ్రిటిషు రాజులు—పూర్వాపరములు

## నలుగురు జార్జీలు.

### ఒకటవ జార్జి (1714-27)

ఈతని పరిపాలన చట్టసమ్మతముగానే యుండెను. ఇంగ్లీషువారి నడవడికలు బాగా తెలియవు. నవీన పద్ధతులలో పార్లమెంటరీ పరిపాలన ప్రారంభ మయ్యెను. ఈపద్ధతులవల్ల, పార్లమెంటు వల్ల ఏర్పడిన ప్రధానమంత్రికి ప్రాముఖ్యత వచ్చెను. ఈతనికాలమున ఏర్పడిన బ్రిటిషుప్రధానమంత్రి సర్ రాబర్టు వాల్‌పోలె. ఈతను 1721-1742 వరకు ప్రధానమంత్రిగా నుండెను స్టూవర్టు కుటుంబములోని రెండవ జేమ్సు కుమారుడైన మూడవజేమ్సును 1715-1719 సంవత్సరములలో బ్రిటనునకు రాజుగ చేయ యత్నాలు జరిగెను. కాని అది ఫలించలేదు.

### రెండవ జార్జి (1727-60)

వాల్‌పోలె ప్రధానమంత్రి ఈయనకాలమునగూడ చాలాకాలము ప్రధానమంత్రిగ నుండెను.

మొదటిలో ఈ రెండవజార్జికి వాల్‌పోలె అంటే ఇష్టంలేదు. కాని క్రమేణ అతని మేధాశక్తికి మెచ్చుకొని సఖ్యతతో పనిచేసిరి. వాల్‌పోలెను 1948 లో తొలగించి ఎరల్ ఆఫ్ విలింగ్టన్ అను వానిని ప్రధానమంత్రిగ ఏర్పాటుచేసెను.

ఈతడు 1742-43 వరకుండెను. ఈతని తర్వాత హెన్రీపెల్ హామ్ అనువాడు 1743-54 వరకు ప్రధానమంత్రిగ నుండెను. ఈతని తర్వాత డ్యూక్ ఆఫ్ ఒకటవ న్యూకాస్లె ప్రధాన మంత్రి అయి 1754-1756 వరకుండెను. ఈతనితర్వాత డ్యూక్ ఆఫ్ డివాన్ షైను ప్రధానమంత్రిగ వచ్చి 1756-57 వరకుండెను. ఈతని తర్వాత రెండవ డ్యూక్ ఆఫ్ కాస్లె ప్రధానమంత్రి అయి 1757-62 వరకుండెను. ఈ రెండవజార్జి పరిపాలనలో ఏడేండ్ల యుద్ధం జరిగెను. 1756-63 వరకు. 1752-9 లో డిడరోట్ అను సారస్వత శాస్త్రవేత్త ఎన్ సైక్లోపేడియాను వ్రాసెను. అనగా సర్వవిద్యావిషయములను శాస్త్రవిషయము లనుగురించి అకారాదిగ వ్రాయబడిన గ్రంథము. మన తెలుగు భాషలో నిట్టి దానిని ఆంధ్రపత్రిక వారు ప్రచురించుచున్నారు.

## మూడవజార్జి (1760-1820)

వేల్సుయొక్క యువరాణి అయిన అగస్టా అనుదాని కొడుకు ఈతడు జన్మించెను. ఈతని పరిపాలనలో అమెరికా స్వాతంత్ర్యవిజయము అమెరికాకు చేకూరెను. అనగా 1775-83 లో అమెరికాలో జరిగిన యుద్ధములో అమెరికనులే జయించిరి. 1767 లో జేమ్సు హార్ గ్రేవ్సు అను శాస్త్రజ్ఞుడు పత్తి రాట్నపు యంత్రమును, రిచర్డ్సు ఆర్ క్ర్యాైటు వార్పుగు అను వాడు దారము దానంతట నదే చుట్టుకొను యంత్రమును కనిపెట్టెను.

1784 లో డా॥ కార్ట్‌రైటు అను క్రైస్తవ దేవాలయపు పూజారి మరమగ్గమును కనుగొనెను. న్యూకోమేన్ అను శాస్త్రవేత్త విద్యుచ్ఛక్తి పరిమాణముయొక్క కొలత తెలిపే యంత్రమును కనుగొనెను.

ఈ మూడవజార్జి పరిపాలనలో యీ దిగువవారు ప్రధాన మంత్రులైరి:—

1. ఎరల్ ఆఫ్, బ్యూటీ 1762-63వరకున్ను
2. జార్జి గ్రిన్‌విల్లె 1763-65 వరకున్ను
3. మార్క్వీస్ ఆఫ్ రాకింగుహాము 1765-66వరకు
4. కాతను 1766-68వరకు
5. డ్యూక్ ఆఫ్ గ్రాఫ్టను 1768-1770 వరకు.
6. నార్తుప్రభువు 1770-1782 యీనార్తుప్రభువు కాలంలోనే అమెరికా పోయినందున యీరాజుకు ప్రజలలో పేరుపోయెను.

7. మార్క్వీస్ ఆవరాకింగుహామ్ 1765-66లో చేసిన ఆయనే మరలవచ్చి 1782 ఏప్రియలు లగాయతు జూలై వరకు అనగా 4 నెల లుండెను.

8. ఎర్‌ల్ షెల్ బుర్నె 1782-83 వరకు.

9. డ్యూక్ ఆఫ్ పోర్టులాండు 1783 ఏప్రియల లగాయితు డిశంబరువరకు అనగా 8నెలలుండెను.

10. విలియంపిట్టు 1783—1801 వర కుండెను. ఈతడు చాలా చిన్నవయస్సులో ప్రధానమంత్రి అయ్యెను. ఈతని కాలంలోనే బ్రిటిషు రాజుకుండే హక్కులను చాలవరకు తొలగించెను. ఫ్రాన్సుతో యుద్ధం సాగించెను.

11. హెన్రీ ఎడ్డిన్గ్టన్ 1801-1803.

12. విలియంపిట్ 1804-6. 1783-1801 వరకు చేసిన పిట్టే మరల వచ్చెను.

13. గ్రేన్విల్లెప్రభువు 1806.

14. డ్యూక్ పోర్టులాండు 1783 లో చేసిన ఆయనే.

15. స్పెన్సర్ పెర్సివాల్ 1809-11.

16. జార్జి కాన్నింగ్ 1812-20 వర కుండెను.

నాల్గవ జార్జి (1820—30)

ఇతడు తరచు భార్యతో తగవులాడేవాడు. అందువలన విలువ తగ్గెను. నెపోలియనుతో యుద్ధము అంతమొందించెను. సంకుచితవాది. పార్లమెంటుతో వ్యతిరేకంవున్నా అనుకున్న సంస్కరణాలను పార్లమెంటుద్వారా గావించెను. ఈతని కాలమున యీ దిగువవారు ప్రధానమంత్రులుగ నుండిరి.

1. జార్జి కాన్నింగు 1812-27

2. గొడెరిచ్ ప్రభువు 1827

3. డ్యూక్ ఆఫ విల్లింగ్టన్ 1828
4. ఎరల్ గ్రే 1829-30

నాల్గవ విలియం (1830-7)

ఈ రాజు మితవాదబృందమునకు చెందెను. ఈతని కుంటి బుగానీయింపు, అవ్యక్తతవల్ల గౌరవము సంపాదించ లేకపోయెను. పార్లమెంటుద్వారా కొన్ని సంస్కరణలు గావించెను. ఈతనికాలమునను్న ప్రధానమంత్రులు.

1. ఎరల్ గ్రే 1830-33
2. విస్కౌంటు మెల్ బౌర్నె 1834
3. సర్ రాబర్టు పిల్ 1834
4. విస్కౌంటుమెల్ బౌర్నె 1835-40

విక్టోరియా రాణి (1837-1901)

నడవడిక, పలుకుబడివల్ల మంచి ప్రఖ్యాతిని గాంచెను. మంత్రి తరగతివారికి రాజకీయపు హక్కులు కలిగించెను. సాంఘికంగా ఉండే దురాచారములకు సంస్కరణలు గావించెను. ఆర్థిక, సాంఘిక, రాజకీయముగ బ్రిటిషు సామ్రాజ్యమును ఎవరును అనుకొననంతటి ఔన్నత్యంలోనికి తేగలిగెను.

1840లో ఆల్బెర్టు రాజును వివాహమాడెను.

ఈమెకాలమున నున్న ప్రధానమంత్రులు.

1. విస్కౌంటు మేల్ బార్నె 1834-40.

2. సర్ రాబర్టు పీల్ 1741-45. 1834లో ఒకసారి ప్రధానమంత్రి యయ్యెను.

3. లార్డు జాన్ రస్సెల్ 1846-1851.

4. ఎరల్ ఆఫ్ డెర్బీ 1852-54.

5. విస్కౌంటు పామెర్‌స్టన్ 1855-57.

6. ఎరల్ అఫ్ డెర్బీ 1858, 1852-54లో చేసెను.

7. విస్కౌంటు పాల్‌మెర్‌స్టన్ 1859, 1855-57 వరకు చేసెను.

8. ఎరల్ రస్సెల్ 1860-65.

9. ఎరెల్ ఆఫ్ డెర్బీ 1865-67, 1852, 1858లో చేసెను.

10. బెన్‌జామిన్ డిస్‌రా ఎలి 1868.

11. విలియం ఎవార్టు గ్లాడ్‌స్టన్ 1868.

12. ఎరల్ ఆఫ్ బి ఆ కొన్సుఫీల్డు 1869-74.

13. గ్లాడ్‌స్టన్ 1875-80.

14. మార్క్వెస్ ఆఫ్ శాలిస్‌బరీ 1886-91.

15. గ్లాడ్‌స్టన్ 1892-93. 1886 లో చేసెను.

16. ఎరల్ ఆఫ్ రోజె బెరీ 1894.

17. మార్క్వెస్ ఆఫ్ శాలిస్బరి 1895-1901-1885 లో చేసెను.

ఏడవ ఎడ్వర్డు 1901 10.

క్వీన్ విక్టోరియా కొమరుకు 59-వ ఏట పట్టాభిషిక్తు డయ్యెను. శాంతిదూత యని యీయనకు పెరు. ప్రభువుల సభకు, ప్రజాప్రతినిధిసభకు (హౌస్ఆఫ్‌లార్డ్సుసభకు హౌస్ ఆఫ్ కామన్సు సభకు) 1909 లో ఆదాయవ్యయపట్టికలో భేదాభిప్రాయములు వచ్చెను. ఈతగాయిదావల్ల మనోవైకల్యము కలిగి 1910 మే నెలలో చనిపోయెను. కాని చనిపోవునప్పుడు మహాసంగ్రామము ఒకటి రాబోతుందనే సంగతిని సూచించెను. ముసలితనములో కన్న యౌవన వయసులో రాజ్యమునకు వచ్చిన యితని ప్రతిభ యింతకన్న హెచ్చియుండేదని బ్రిటిష్ప్రజ లనుకొనేవారు.

ఈయన కాలముననుండే ప్రధానమంత్రులు

(1) ఆర్తర్ జేమ్సు బాల్ఫోర్ 1902-3.

(2) సర్. హెచ్. కాంబెల్ బన్నేర్‌మాన్ 1903-5.

(3) హెర్బెర్టు హెన్రీ అస్క్విత్ 1908-14

అయిదవ జార్జి 1910-36

నాయనమ్మ అయిన విక్టోరియారాణియొక్క కీర్తినే ఈయన గడించెను. ఈయనకాలముననే మహాసంగ్రామము జరిగెను. సంగ్రామానంతరము వర్తకమాంద్యము సంభవించెను.

ఆర్థికముగను రాజకీయముగను ఒక దేశము మరో దేశమును జూచి సహించలేని స్థితిలోనికి వచ్చెను.

విరామము లేక రాజ్యాంగవ్యవహారమును చక్క బెట్టి పటుల చరిత్రకారులు వ్రాస్తున్నారు. ఇండియాలో సత్యాగ్రహోద్యమము యీయన పరిపాలనలోనే బయలుదేరెను.

---

## ఈయన కాలమున నున్న ప్రధానమంత్రులు.

1. హెర్ బెర్టు ఆస్క్వొత్తు (1906—14
2. హెచ్. హెచ్. ఆస్క్వొత్తు 1915
3. డేవిడ్ లాయిడ్ జార్జి (మితవాది) 1916—21
4. ఆణ్ర్డూ బోసర్ లా 1822
5. స్టాన్లీ బాల్డ్విన్ కన్ సెర్ వెటివు పార్టీ 1923
6. జె. రామ్సె మాక్డనాల్డు కార్మికపార్టీ 1924
7. స్టాన్లీ బాల్డ్విన 1924—28 1923 లో వేసెను.
8. జె. రామ్సె మాక్డనాల్డు 1929—34
9. స్టాన్లీ బాల్డ్విన్ 1935—37 1923, 1925—34

వరకు చేసెను.

1935 ఇండియా ఆక్టును సంకుచిత దృష్టితో తయారు చేయుటకు మాక్డనాల్డు, బాల్డ్విన్ ప్రధానమంత్రులుగ నున్నపుడే తయారు అయిన ఏని భారతీయ ప్రజలు ఎన్నటికి మరువలేరు. ఇంతియేగాక కార్మికపక్షమునుండి ప్రధానమంత్రి అయిన మాక్డనాల్డు పరిపాలనలోనే ఉప్పు సత్యాగ్రహమును మహాత్మా గాంధి నడపెను. ఈ సత్యాగ్రహమును అణచుటకు లాఠీలు, తుపాకిగుండ్లు, వాయువిమానములనుండి బాంబులు విసరుట, జైళ్ళకు నిరాయుధులను పంపుట మున్నగు పనులు గావించెను.

## ఎనిమిదవ ఎడ్వర్డు 1936.

తండ్రిఅయిన ఆయిదవజార్జి గతించిపోగా 20 జనవరి 1936 లో రాజయ్యెను. తాను వలచిన స్త్రీని పెండ్లాడుటకు బ్రిటిషు పార్లమెంటు అంగీకరించనందున తానువలచిన స్త్రీనే పెండ్లాడుటకు 10 డిశంబరు 1936 న రాజ్యమును స్వబుద్ధితో విడిచి జ్యేష్ఠ సోదరుడైన ఆరవజార్జికి రాజ్యమును వప్పగించి ఇంగ్లండునువదలి ఆస్ట్రియాదేశమునకు వెడలిపోయెను. అక్కడే తాను వరించిన సిమ్సన్ అనునామెను వివాహం చేసికొనెను. ఈ సిమ్సన్‌నకు భర్తవుండగా ఆమె ఆభర్తకు విడాకులిచ్చెనన్న వివరములు భారతీయులు పత్రికలలో చదివేయుందురు.

ఆరవ జార్జి 1936

అన్నగారు వప్పగించిన రాజ్యమును నిర్వహించు చుండెను.

ఈయన కాలమున ప్రధానమంత్రులు: స్టాన్లీ బాల్డ్విన్ తన మంత్రిత్వమును తానే వదలుకొనెను. అటుపిమ్మట 1937 నెవిలీ చాంబర్లేన్ ప్రధానమంత్రిగ వచ్చెను.

నేటి రోజుననుండే బ్రిటిషు రాజు బ్రిటిషు పార్లమెంటు

రాజునకుండే రాజ్యాంగపుహక్కులు ఇప్పట్లో ప్రజలచే వోటుయిచ్చి ఎన్నుకోబడి పార్లమెంటుకు సభ్యులుగా వెళ్లిన సభ్యులలో ఏ పక్షము హెచ్చు సంఖ్యాకులుగ వస్తే ఆపక్షములోనుండే నాయకునిని రాజు ప్రధానమంత్రిగా నియమించును. ఆప్రధానమంత్రి తన మంత్రివర్గమును ఏర్పాటు చేసి రాజునకు తెలుపును. రాజ్యభారమంతా ప్రధానమంత్రే వహించును. కాని రాజ్యపరిపాలన అంతా రాజుపేరిటనే జరుగుచుండుటచే రాజ్యాంగచట్టరీత్యా ప్రతిమంత్రి రాజునకే బద్ధుడై యుండవలెను. కాని ఆచారంలో మాత్రం ప్రధానమంత్రికి బద్ధులై యుంటున్నారు.

పెత్తనం అంతా పార్లమెంటుదే అయినపుడు రాజు నామకార్థంగా ఎందుకని అనుకోవచ్చును. రాజు వుండడంవల్ల

జాతీయతకు సామ్రాజ్య తత్త్వమునకు విచ్ఛిన్నము రాదనే కారణంతో బ్రిటిషువారు రాజును నిలుపుకొన్నారు. ఈరాజే బ్రిటిషువారి వలసస్వరాజ్యాలకు చక్రవర్తి అధికారముతో వాటిని పరిపాలించుచుండును. అంటే రాజుపేరిటనే యీవలస రాజ్యాలను బ్రిటిషు పార్లమెంటుయొక్క ప్రధానమంత్రియే పరిపాలించుచుండుండునదేది గ్రహింతురుగాక! ప్రధానమంత్రి వుండే పార్టీయొక్క ఆశయములను బట్టియే పరిపాలన సాగుచుండును.

